# శ్రీ దేవులపల్లి

# కృష్ణశాస్త్రి కృతులు



## కృష్ణపక్షము

## ప్రవాసము

## ఊర్వశి

పబ్లిషర్సు

రౌతు చంద్రయ్య అండ్ సన్సు

రౌతు బుక్కు డిపో

రాజమండ్రి.

౧౯౫౭

# అనుక్రమణిక

## కృష్ణపక్షము

## ప్ర వా స ము



## ఊ ర్వ శి

శ్రీ శ్రీ శ్రీ మహారాజా
రావు వేంకట కుమార మహీపతి
సూర్యారావు బహద్దరు వారికి

తరుణ శృంగార మధుర మాధవుఁడ వీవు,
కలికిపాటల కోయిలకొలము మాది ;
తావకీన సభావన తరువితాన
శాఖికల నిత్యనూతన స్వాదుగాన
జీవసారముఁ గురియించి చివురులెత్తఁ
బాడుకొన్నారు మాకులస్వాములెల్ల
స్వచ్ఛకీర్తి ! మనోజ్ఞ వసంతమూర్తి !
పికకుమారకు నన్నుఁ బాడుకొన నిమ్ము,
మాలగాఁ దొలిపాటలు పూలతోడ
హృదయమే కూర్చి నీకొఱ కెదురుమాతు !

ఆకులో నాకునై పూవులోఁ బూవునై
కొమ్మలోఁ గొమ్మనై నునులేఁత రెమ్మనై
    ఈ యడవి దాగి పోనా
            ఎటులైన
    నిచటనే యాగి పోనా ?

గల గలని వీచు చిఱుగాలిలోఁ గెరటమై
జల జలని పాఱు సెలపాటలోఁ దేటనై
    ఈ యడవి దాగి పోనా
            ఎటులైన
    నిచటనే యాగి పోనా ?

పగడాల చిగురాకు తెరచాటు తేఁటినై
పరువంపు విరిచేడె చిన్నారి సిగ్గునై
    ఈ యడవి దాగి పోనా
            ఎటులైన
    నిచటనే యాగి పోనా ?

తరు వెక్కి యల నీలగిరి నెక్కి మెల మెల్లఁ
జడ లెక్కి జలదంపు నీలంపు సిగ్గునై
ఈ యడవి దాగి పోనా
ఎక్కడైన
నిచటనే యాగి పోనా ?

ఆఁకలా దాహమా చింతలా వంతలా
ఈ కరణి వెఱ్ఱినై యేకతమ తిరుగాడ
ఈ యడవి దాగి పోనా
ఎక్కడైన
నిచటనే యాగి పోనా ?

# స్వేచ్ఛా గానము: ౧

తిమిరలత తారకా కుసుమములఁ దాల్పఁ
గర్కశ శిలయు నవజీవకళలఁ దేఱ
మ్రోడు మోక చివురు లెత్తి మురువు సూప
జగము నిండ స్వేచ్ఛాగాన ఝురుల నింతు.

క్రౌర్య కౌటిల్య కల్పిత కఠిన దాస్య
శృంఖలములు తమంతనె చెదరి పోవ
గగనతలము మార్మ్రోగఁగఁ గంఠ మెత్తి
జగము నిండ స్వేచ్ఛాగాన ఝురుల నింతు.

చిత్త మానందమయ మరీచికల సోల
హృదయ మానందభంగ మాలికలఁ దేల
కనుల నానంద జనితాశ్రుకణము లూర
జగము నిండ స్వేచ్ఛాగాన ఝురుల నింతు.

యుగయుగంబుల నీశ్వరయోధు లగుచు
స్వేచ్ఛకై ప్రాణసుమము లర్పించువారి
యమల జీవిత ఫలము ధన్యతను గాంచ
జగము నిండ స్వేచ్ఛాగాన ఝరుల వింతు.

భయముఁ గలిగించు కష్టాతపంబు మఱచి
కరము కలఁగించు వంత చీఁకట్లు మఱచి
విశ్వమే పరవశ మయి వెంటఁ బాడ
జగము నిండ స్వేచ్ఛాగాన ఝరుల వింతు.

# స్వేచ్ఛా గానము: ౨

నవ్వి పోదురు గాక నా కేటి సిగ్గు ?
నా యిచ్ఛయే గాక నా కేటి వెఱపు ?
కలవిహంగమ పక్షములఁ దేలియాడి
తారకా మణులలోఁ దారనై మెలసి
మాయ మయ్యెదను నా మధురగానమున !
నవ్వి పోదురు గాక నా కేటి సిగ్గు ?

మొయిలు దోనెలలోనఁ బయనం బొనర్చి
మిన్నెల్ల విహరించి మెఱపునై మెఱసి
పాడుచుఁ జినుకునై పడిపోదు నిలకు
నవ్వి పోదురు గాక నా కేటి సిగ్గు ?

తెలిమబ్బు తెరచాటు చెలిచందమామ
జతఁగూడి దోబూచి సరసాల నాడి
దిగి రాను దిగి రాను దివినుండి భువికి
నవ్వి పోదురు గాక నా కేటి సిగ్గు ?

శీకరంబులతోడఁ జిఱుమీలతోడ
నవమౌక్తికములతో నాట్యమ్ము లాడి
జలధి గర్భమ్ము లోపల మునిగిపోదు
నవ్వి పోదురు గాక నా కేటి సిగ్గు?

పరువెత్తి పరువెత్తి పవనునితోడఁ
దరుశాఖఁ దూఱి పత్రములను జేరి
ప్రణయ రహస్యాలు పల్కుచు నుందు;
నవ్వి పోదురు గాక నా కేటి సిగ్గు?

అలరుపడంతి జక్కిలిగింత వెట్టి
విరిచేడె పులకింప సరసను బాడి
మఱియొక్క నవతోడ మంతనం బాడి
వే ఱొక్క సుమకాంత వ్రీడఁ బోఁ గొట్టి
క్రొందేనెసోనలఁ గ్రోలి సోలుటకుఁ
బూవుపూవునకును బోవుచు నుందు;
నవ్వి పోదురు గాక నా కేటి సిగ్గు?

పక్షి నయ్యెదఁ జిన్ని ఋక్ష మయ్యెదను
మధుప మయ్యెదఁ జందమామ నయ్యెదను
మేఘ మయ్యెద వింత మెఱపు నయ్యెదను

అలరు నయ్యేదఁ జిగురాకు నయ్యేదను
పాట నయ్యేదఁ గొండవాగు నయ్యేదను
పవన మయ్యేద వార్ధిభంగ మయ్యేదను
ఏలాకో యెప్పుడో యెటులనో గాని
మాయ మయ్యేద నేను మాఱిపోయెదను.
నవ్వి పోదురు గాక నా కేటి సిగ్గు ?
నా యిచ్ఛయే గాక నా కేటి వెఱపు ?

# నేను

జిలుగు వసనాల మణిమయోజ్జ్వల మనోజ్ఞ
కాంచనాంచిత భూషణగణముఁ బూని
రాజవీథుల రతనాలరథము నెక్కి
వెడలు నిర్జీవ పాషాణ విగ్రహంబ !
చిమ్మచీఁకటి పొగల నిశీథమందు,
క్షుద్రమందిరాంతర జీర్ణకుడ్యతలము
లందుఁ, గన్నులు మూసి, యానందవశత,
యోగవిజ్ఞాన మబ్బిన యోజ, నొడలు
మఱచి, కులుకుదివాంధమా ! మెఱుఁగు లొలుకు
చలువఱాతిమేడల చెఱసాలలందు,
తళుకుబంగారు సంకెళ్ళఁ దాల్చి, లోక
పాలకునిబోలె మురియు నోబానిసీఁడ !
ఓ కుటిలపన్నగమ ! చెవి యొగ్గి వినుఁడు !
ఏను స్వేచ్ఛాకుమారుఁడ నేను గగన
పథవిహార విహంగమపతిని నేను
మోహనవినీల జలధరమూర్తి నేను
ప్రళయ ఝంఝూప్రభంజన స్వామి నేను !

# నా జీ వి త ము

వింతగాఁ దోఁచు నాదు జీవితము నాకె!
జిలుఁగు వెన్నెలతోఁ జిమ్మ చీఁకటులతో;
అమల మోహన సంగీతమందు హృదయ
దళన దారుణ రోదనధ్వనులు విందు;
వక్రగతిఁ బోదుఁ జక్కని పథము నందె,
రాజపథమునకై కుమార్గమునఁ జూతు;
గరళమే తిందుఁ గడుపార నెఱిఁగి యెఱిఁగి;
యవలఁ ద్రోతుఁ జేతులార నమృతరసము;
విస మమృతమట్టు లమృతంబు విసమురీతిఁ
జిత్రచిత్రగతుల మార్చు జీవితంబు!

## తేఁటి వలపు

మలయ సమీరణోర్మికల
మాలికలం బ్రణయార్ద్రగీతికల్
మలయుచు నాట్య మాడవు
సుమప్రమదామణి పుల్కరింప నో
యళివర, తేనె లానవు వనాంతర
మంతయుఁ జిన్నవోయెఁ గో
మల జలజాత పత్రముల మాటున
నేటికి డాగినాఁడవో!

అలరుఁ బడంతు లెల్లరు హిమాంబువులన్
నవ మల్లికా సతిన్
జలకము లార్చినారు వనజాత
పరాగ మలందినారు మేల్
జిలుఁగు హొరంగు పొందళుకుఁ
జీరలఁ గట్టిరి పెండ్లి కంచుఁ గో
మల జలజాత పత్రముల మాటున
నేటికి డాగినాఁడవో!

అలరుచు మల్లికా పరిణయం బని
    వచ్చిరి పూవుబోండ్లు కో
యిల సవరించె గొంతు తమ
    యేలికకై విరిదేనెపానకం
బళితతి గూర్చెఁ బుప్పొడుల
    నత్తరులం బవనుండు చేర్చెఁ గో
మల జలజాత పత్రముల మాటున
    నేటికి డాగినాఁడవో !

వలపు హరించినాఁడ వఁట
    స్వాదు మరందముఁ గ్రోలి తంట మైఁ
బులకలు పుట్టఁగా మధురమోహన
    గానముఁ జేసి తంట మా
లలన యమాయికాత్మ భ్రమరా !
    తగునా వగ వాడఁ జేయఁ గో
మల జలజాత పత్రముల మాటున
    నేటికి డాగినాఁడవో !

వలపులు గ్రుమ్మరింపదు నవ
    ప్రణయోదయ హాసచంద్రికల్

చిలుకదు తోడి చిన్ని విరిచేడెలతో
జతఁ గూడి నాట్యముల్
సలుపదు మంచుముత్యములు షట్పద !
తాల్పదు మల్లికాంబ; కో
మల జలజాత పత్రముల మాటున
నేటికి డాగినాఁడవో !

జల జల రాల్చు దుర్భరవిషాదమునం
దుహినాశ్రు బిందువుల్
వెలవెలఁ బోవు మారుతము
వీచినఁ బాదపపత్ర సంతతిన్
దలిరులు విన్నఁబోయి యెదొ
త ప్పొనరించినరీతి నక్కుఁ గో
మల జలజాత పత్రముల మాటున
నేటికి డాగినాఁడవో !

లలిత మనోజ్ఞమూర్తి యళిరాజు
మనోహర గాన సత్కళా
విలసితుఁ డార్ద్రచిత్తుఁ డని
బేల వరించెను నిన్ను మాలికా

లలన యెఱుంగ దింత యనురాగము
    తేనెల తేట కంచుఁ గో
మల జలజాత పత్త్రముల మాటున
    నేటికి డాగినాఁడవో !

తేనెలం గూర్చి వలపులఁ దేటపఱచి
ధన్యురా లయ్యె మీచెలి తలిరుబోణి !
కాని నిరతంబు మల్లికకడనె యుండి
ముదము గూర్పఁగ మా కొక్క-పూవె చెపుమ ?

## కవి కుమార

నవవికస్వర దివ్య సౌందర్య మూర్తి
విశ్వసుందరి పరమ పవిత్రమూర్తి
యుదయలక్ష్మి యవతరించె; నెదురు వోయి
స్వాగతం బిమ్ము గీతికా ప్రసవ మొసఁగి!

అవిరళ స్వేచ్ఛ వెన్కముం దరయఁ బోక
వారిదమ్ములు చిత్రకాశ్మీర రుచులఁ
బూని విహరించుఁ బశ్చిమ భూధరమున
రజని రా నున్న దంచుఁ దెల్పంగ రాదె?

శ్యామలాంబర పరిణాహ సరసిలోనఁ
బ్రణయలీలా విహార విలాసిను లగు
తారకలఁ గాంచుమా? నీ హృదయమునందు
భావనక్షత్రకాంతులు పర్వ నేమొ!

## విరిచేడె

రంగు రంగుల సొగసుచీరల ధరించి
నవ్వు వెన్నెల గాయు క్రొన్ననలనడుమ
వాడి వాడని యీవిరిచేడె తాల్చు
మంచుముత్త్రియములఁ గన మది కరంగు.

# అన్వేషణము

"తలిరాకు జొంపముల సం
దులత్రోవల నేల వాలు తుహినకిరణకో
మల రేఖవా! పువుఁదీవవా!
వెలఁదీ! యెవ్వతెవు నీపవిటపీవనిలోన్?

కారుమొయిళ్ళ కాటుకపొగల్
వెలిగ్రక్కు తమాలవాటి నే
దారియుఁ గానరాదు, నెలఁతా!
యెటు వోయెద వర్ధరాత్రి! వి
స్ఫారవిలోచనాంధ తమసమ్ములఁ
జిమ్ముచు, వేడివేడి ని
ట్టూరుపులన్ నిశీథ పవనోర్మి
వితానము మేలుకొల్పుచున్."

"అది శరద్రాత్రి; శీత చంద్రాతపాంత
రాళ రమణీయ రజత తల్పంబునందుఁ
జల్లఁగా నిద్రవోవు వ్రేపల్లెవాడ
సకలగోపాల గోపికా జనముతోడ.

సాము సడలిన పతిపరిష్వంగమందు
సుఖము దుఃఖము లేని సుషుప్తిలోన
స్వప్నవీథి యథేష్ట సంచార కలన
మేను మఱచిన నన్నంత మేలుకొలిపె
శర్వరీ శీతపవన పక్షముల మలసి
స్వాదు యమునోర్మిసంగీత ఝురులఁ గలసి
కౌముదీధౌత శుభ్రదిక్తటుల సొలసి
మురళికామంద మందమాధురుల రుచులు.

ఎలదేఁటి చిఱుపాట సెలయేటి కెరటాలఁ
    బడిపోవు విరికన్నె వలపువోలె
తీయని మల్లెపూఁదేనె సోనల పైని
    తూగాడు తలిరాకు దోనెవోలె
తొలిప్రొద్దు తెమ్మెర త్రోవలోఁ బయనమై
    పరువెత్తు కోయిల పాటవోలె
వెల్లువలై పారు వెలఁది వెన్నెలలోన
మునిఁగిపోయిన మబ్బుతునుకవోలె

చిఱుత తొలకరివానగాఁ జిన్నిసోనగఁ
బొంగి పొరలెడు కాల్వగా నింగి కెగయు

కదలిగాఁ బిల్లఁగ్రోవిని వెడలు వింత
తీయఁదనముల లీనమై పోయె నెడఁద.

పరువు పరువునఁ బోవు నెదతో
పరువు లెత్తితి మఱచి మేనే
మఱచి సర్వము నన్ను నేనే
మఱచి నడిరేయిన్ !"

"ప్రాణనాయకు కౌఁగిలి పట్టు వదలి
యిల్లు వదలి యెన్నండు నీపల్లె వదలి
యడు గిడని దాన వానాఁటి యర్ధరాత్రి
విజన పథములఁ బడి యెట్లు వెడలినావు ?"

"తావులతోడఁ దేనియల
ధారలఁ జిప్పిలు వేణుగీతికా
రావముతోడ మందగతులన్
జను మారుతముల్ విశాల బృం
దావన వీథులందు యమునా
నవభంగ మృదంగ వాద్యముల్

స్త్రోవ స్ఫురింపఁగా పలపు
    తొందర వెట్టఁగఁ బోతి నొంటిమై.

సన్నని యెలుగెత్తి జాలిగా నెవరినో
    యరయుమా ! పిలుచుచున్నదియె యమున !
ప్రక్క నిర్జీవ ధావళ్యమ్ముతో నున్న
    సికతాతలమ్ము గాంచితివె, దాని ?
తుది మొదల్ లే దిదే స్త్రోవరుల్ స్త్రొక్కని
    యీదారినే పరువెత్తినాను ?
ఈమొండిచేతుల నెత్తి యీవనతరుల్
    శూన్యదృక్కుల దిశల్ చూచు నయ్యొ !

ఇచటనె యిచటనే యతఁ డిచట నేను—
ఇచట నీ జాజిపూఁబొదరింట నేను—
ఈకడిమిచెట్టు క్రింద సుమ్మీ యతండు—
సరిగఁ గన్నులఁ గట్టిన సరణిఁ దోఁచు.

శారదశర్వరీ మధుర చంద్రిక
    సూర్యసుతాస్రవంతికా
చారువినీల వీచిక ప్రశాంత
    నిశాపవనోర్మిమాలికా

చారిత నీపశాఖిక కృశాంగిని
    గోపిక నేను నాఁడు బృం
దా రమణీయసీమ వినినారము
    మోహనవేణుగానముఁ.

మలయ పవను కౌఁగిలిలోనె పులకరించి
హాయిగాఁ గంఠ మెత్తు ప్రాయంపు వంశి
విశ్వమోహను జిలిబిలి పెదవు లంటి
యవశమై పోయి యేమి చేయంగ లేదు ?

బాలగోపాలుఁ బోలెడు పాటగానిఁ
గని విని యెఱుంగ మెన్నండు; కరములోని
మురళిసే కాదు, నాలోని మ్రోడుఁ బెడఁద,
నీశిథిల జీవనమ్ము మ్రోయింపఁ గలఁడు.

నందగోపకుమారు నానంద మురళి
కా మనోహర సుషిరాపగాతరంగ
జాలములఁ దారకా రవి చంద్రతతులు
కరఁగి చిని చిన్ని గీతులై కలిసిపోవు.

చూచితిరో లేదో చిన్నికృష్ణుని సొబంగు ?
పెదవి చివురు సంజల నరవిచ్చు నవ్వు
వెన్నెల, చలించు తుమ్మెద బెళుకు చూపు,
లోలపవనచాలిత కుటిలాలకమ్ము,
తరళచూడాకలాపమ్ము, మురళిఁ గూడి
యల్ల నల్లన గొం తెత్తి యమృతగాన
శీతలతుషారముల విరఁజిమ్ము వేళఁ
జిన్నికృష్ణుని సొబఁగుఁ జూచితివొ లేదొ ?

లేవు శరత్తమస్వినులు
    లేవు మనోజ్ఞసుధాంశుమాలికల్
లేవు వినీల నిర్మల కళిందసుతా
    నవనాట్య సంపదల్
లేవు మదీయ గాత్రలవలిం
    బులకాంకురకోరకావళుల్
లేవు కుమార గోప మురళీ
    మృదు గీత ఝరీ విలాసముల్ ?

జిలిబిలి పట్టుతేకుల వెన్కఁ దొట్రిలు
మల్లియయెద దాగు మధుపరవము
కను చూపు దాటు నామనిఁ బాయుకోయిల
గొంతులోఁ జిక్కు వసంతగీతి
విభు వీడి శుష్కించువిరహిణి సెలయేటి
కడుపులో నడఁగిన కడలి మ్రోఁత
తేనికై వెదకెడు తిక్కచూపులలోనఁ
జెర వడ్డ నిండుచందురునిపాట
యిట్లు నీదీన గోపికా హృదయమంది
రాంతరాళములోనఁ ద్రుళ్ళింత లాడు
వేణు నాదంబు, విడిపింపు విశ్వమోహ
నాకృతిఁ గిశోరగాయకు నరయుచుంటి.

ఇది నాచరితము విని నీ
వదరెదు తొట్రిలెదు వడఁకు దటు నిటు కనులన్
బెదరెదు చూపుల నేదో
వెదకెదు ? ఎవ్వతెవు నీపవిటపీవనిలోన్ !''

# విశ్రాంతి

నీలాభ్ర సరసిలో నిండు జాబిల్లి
రాయంచవలె విహారము సల్పుచుండె;
కమ్మతెమ్మెరలు శాఖా పత్రములనో
కల్లోలినీ తరంగములనో డాగె;
నాట్యంబు మధురగానంబును మాని
గాటంపునిద్దురఁ గాంచె శైవలిని;
సర్వేశ్వరుని హస్త జలజ యుగ్మమున
విశ్వమే హాయిగా విశ్రాంతిఁ జెందె!

# మహాకవి

(గురజాడ అప్పారావు)

గుత్తునా యని జాతి ముత్యాల్
గుచ్చినాఁడే మేలిసరముల
ఇత్తునా యని తెలుఁగుఁదల్లికి
ఇచ్చినాఁడే భక్తితో !

నవవసంతము నవ్యవనరమ
మావికొమ్మలఁ గమ్మచివురులు
పాట పాడెడి పరభృతంబును
ఎవ్వ రాపుదురో !

పొదుపుమల పయి రంగవల్లిక
మింటినడుమఁ బ్రచండతేజము
సంజమబ్బుల పైని కెంపులు
చూడకుంటిరిగా !

రంగవల్లిక మాయ మయ్యెను
చండ తెజము మాసిపోయెను
సందెకెంపులు సాగిపోయెను
వెదకు చున్నారా !

—శిర

కారుచీఁకటి గ్రమ్మినప్పుడె
చదలు మబ్బులు కప్పినప్పుడె
మిణుఁగు రైనను మెఱయనప్పుడె
వెదకు చున్నారా !

చుక్క లన్నియు సొక్కి సోలెను
గిరులు కదలెను, దిరుగఁ బాడెను
లోకమోహన మధురగానా
స్వాదమోదమున.

యుగయుగంబులనుండి మ్రోఁగెడు
విశ్వగాన వియత్తరంగిణి
భంగముల నుప్పొంగు నాతని
గీతశీకరముల్.

పాట పాడిన పరభృతంబును
మూఁగవోయిన ముద్దుకోయిలఁ
జిన్నిపికములు చిఱుతపాటలఁ
బిలుచు చున్నవియా !

—అగ్ని

## అతని పాట

సంజముద్దుమొగంబుఁ గెంజాయ గప్పఁ
గన్ను లల్లన నరవిచ్చి గగనవీథి
మెల్లగాఁ జల్లగా సాగు మేఘు మీఁదఁ
దరళ మోహన వీక్షణతతులు నిల్పి,
మంద మలయానిలోర్మికా మాలికలను
లలిత సుకుమార మధుర బాలస్వరంబు
నెత్తి, పాడితి వేమేమొ హృదయకమల
వికసనోద్బోధకం బగు వింతగీతి.

సందెవేళ, పొలముగట్టు, చల్లగాలి,
చేతిలోఁ జేయి, నునులేఁత చిత్తములును;
ఈవు నేనె పిట్టలటుల నేమి యనక;
సర్వమును జేర నొక్క యపూర్వ భావ
ముదయ మయ్యెఁ గుమార, నాహృదయమందు!
మొగముఁ గంటిఁ, గనులఁ గంటి, మొగిలుఁ గంటి
పాట వినుచుంటి....

# లోకము

పొడుపుమలపయి బంగరు మ్రుగ్గు లుంచి
సంజమబ్బుల కుంగరాల్ సంతరించి
పోవు చున్నావు, నీ వేమి పొందితోయి ?
వెఱ్ఱి మిత్రుఁడ, లోకంపువిధముఁ గనవా ?

మధుర మకరందరసమును మధుపమునకుఁ
బుప్పొడి దుమారము సమీర పుత్రకునకు
నిచ్చితివి కావె, నీ యంత నీవె పిలిచి
తరళ తుహినాశ్రు లేల గేటంగిపడుచ ?

తోయములఁ దీయ నైన పానీయ మొసఁగి
వలపు నునులేఁతగాలి వీవనల విసరి
ప్రబల నైదాఘ తీవ్రాతపంబువలన
నిట్టు లైతివె సెలయేఱ, తుట్టతుదకు !

—శ్రీ

# ఏల ప్రేమింతును?

సౌరభము లేల చిమ్ముఁ బుష్పవ్రజంబు ?
చంద్రికల నేల వెదఁజల్లుఁ జందమామ ?
ఏల సలిలంబు పాఱు ? గాడ్పేల విసరు ?
ఏల నా హృదయంబు ప్రేమించు నిన్ను ?

మావిగున్న కొమ్మను మధుమాసవేళఁ
బల్లవము మెక్కి కోయిల పాడు టేల ?
పరులఁ దనియించుటకొ ? తన బాగుకొఱకొ ?
గాన మొనరింపక బ్రతుకు గడవఁ బోకొ ?

—శ్రీ

# ది వ్య భా గ్య ము

హేమమణిరత్నగణ మేల లేమ, మనకు ?
సాంధ్యసమయసువర్ణితచ్ఛాయ లరసి
తారకా శోభితాంబరతలముఁ గాంచి
చింతలను బాయుదము చేయిఁ జేయి కలిపి !

ముత్తియంపుసరము లేల ముదిత, మనకు ?
వలపుఁబాటల త్రుళ్ళింత లొలయ నాడు
సెలల తరఁగల నురువుల చెలువుఁ జూచి
ప్రీతి నుండుద మలఁతి కోరికలఁ బాసి.

సార్వభౌమభోగము లేల చాన, మనకు ?
ఏలికల మౌద మన్యోన్య హృదయములకు !
ప్రవిమల ప్రేమసామ్రాజ్యపట్టభద్ర
భాగ్యముం గన్న జీవితసంపద ల వేల ?

— శ్రీనా

## నా ప్రేమ

క్రౌర్య కౌటిల్య కలుష పంకంబు వలన
మలిన మౌ నాహృదయము ధామ మెటు లయ్యె
నతివిశుద్ధము మధురము నఘరహితము
ప్రణయమున కంచు సందియపడుదు వేమొ !

ప్రేయసీ ! శర్వరీ తమోవీథులఁబడి
చందురుఁడు రాడె పూర్ణతేజస్వి యగుచు;
అఘవిదూషిత మీహృదయంబునందె
ప్రేమ కోమలతమము పవిత్ర మయ్యె.

విరిసీ విరియని క్రొవ్విరి నరయుటకును
ఎంతో సందియపడ, స్పృశియింపఁ గలమె ?
వలపుల హరింపఁ గలమె ? యౌవనము సూత్న
వికసితము; కలుషహృదయము వెఱపుఁ జెందు.

# ప్రా ణ కా ం త

ప్రణయ మలయానిలోర్మికాపటలి నూఁగు
సౌరభము, గానమూ, నిండుశాంతి నిండు !
ప్రాణమునకును బ్రాణ మా ప్రాణకాంత
యూర్పుతరఁగల నోలాడి యున్నవారె ?

ప్రణయ నీరజ మధుర సౌరభముఁ గ్రోలు
హిమకణము, తేనెచినుక, మీ రిందు శాంతి !
ప్రాణమునకును బ్రాణ మా ప్రాణకాంత
యెడఁద శోధించి యశ్రులై పడిరె యిచట ?

ప్రణయ విమలాంబరాబ్ధి గర్భమునఁ దేలు
నీరదము, నీలమా, యిందు నిండుశాంతి !
ప్రాణమునకును బ్రాణ మా ప్రాణకాంత
మానసక్లేశ లవ మూని మాఱినారె ?

ప్రణయవనతరుశాఖలఁ బల్లవించు
తేఁటిమ్రోఁత, కోయిలకూఁత, తెండు శాంతి !
ప్రాణమునకును బ్రాణ మా ప్రాణకాంత
విరహగీతిక లప్పుఁజెప్పెదరొ యేమొ !

## మాటి మాటికి

ఏడఁ జనిన మనోహారి జాడ లరసి
కలఁగు హృదయంబు, నెమ్మది చలన మొందు
కనులు మూసిన, లోకమోహన మనోజ్ఞ
మూర్తి చిరునవ్వుఁ జిలుకుచు మ్రోల నిలుచు.

హృదయ మక్కట ! నవసుమ మృదుల మగుట
విరహ బాధ కన్నీరుగా వెడలరాదె ?
అతిభయంకర సాంద్ర నీలాభ్రపటలి
వాన గురిసిన ధవళిమఁ బూనుఁ గాదె ?

పూత గోదావరీ ప్రవంతీతరంగ
మాలికాడోలికల నూఁగు మలయపవన !
ఏల కొంపోవు హృదయంబు నేర్చి వెడలు
వేడి నిట్టూర్పుగాడ్పుల వెలఁదికడకు ?

పొంగి కిల కిల నవ్వి యుప్పొంగి పొరలు
తరఁగలార, నాబాధలఁ దలఁప రయ్యొ !
ప్రాణనాథుండు మీ యుడురాజు మిమ్ము
వీడినప్పుడు త్రుళ్ళింత లేద కరుగు ?

జలనిధులు దాఁటి యున్నతాచలము లెక్కి
హృదయ మది యేమొ క్రిందు మీఁదెఱుఁగకుండఁ
బక్షివలె ఱెక్కలం దాల్చి పరువు లిడును
మాటిమాటికి వలపుల పేటికడకు ?

# ప్రేయసీ!

ప్రేయసీ ప్రేయసీ । ప్రియుడనే ప్రేయసీ
వేయి కన్నులు దాల్చి । వెదకుచున్నానే!
నల్లమేఘాలలో । నాయమా దాఁగంగ?
తల్లడిలవో నన్నుఁ । దలఁచి రావో!

మెఱపువై యొయ్యారి । మెఱపువై కాన్పించి
యరసినంతనె మబ్బు । తెరల దాఁగితివా!
తళకు మని కనిపించి । వలపు వెల్లువ ముంచి
వలపించి మాయమై । వనటఁ గూర్చితివా!

"నల్ల మబ్బుల నింగి । నా సౌధరాజమ్ము
నల్లమబ్బే ప్రియుఁడు । నన్నుఁ గోరకుమా!"
ఆడుచును బాడుచును । హాయిగా నవ్వుచును
పాడుమేఘాలతోఁ । బరుగెత్తె మెఱపు!

కిలకిలని నవ్వు చెలులతోఁ గలసి మెలసి
పూవుపై మబ్బుపై చిన్ని పుల్గు వోచుఁ
బ్రసవ కోమల రమణీయ పథముఁ బట్టి
పోవుచుందువు లావణ్యమూర్తి వీవు.

ఏనా దీనుఁడ నే నీడనైన నోదిగి—
అడుగిడగ లేక నిట్టూర్పు విడువ లేక
పొరలు కన్నీటికాల్వలు గురియలేక—
ఏనా దీనుఁడ నే నీడనైన నోదిగి
కాంచెదను నిన్నుఁ గనులారఁ గఱవుదీర !

ప్రసవములఁ జల్లి గానసౌరభముఁ జల్లి
ప్రవిమలానంద నృత్యోత్సవములఁ దేల్చి
నిన్ను వలపింపఁ బూనుదు రెన్నొగతుల.

ఏనా దీనుఁడ నే నీడనైన నోదిగి—
హృదయనేతవు భవదీయపదసరోజ
మృదు రజోలేశ దివ్యసంపదను వలచి

ఎడఁద కలఁగించి విదళించి యేర్చి వెడలు
వేడినిట్టూర్పు గాడ్పులఁ బెదవు లదర
నామనోహారి నిన్నుఁ గన్నారఁ గాంచ
నలవి గాకుండ దుఃఖాశ్రుసలిలమౌక్తి
కం బొకటి నాదుప్రణయ వీక్షణముఁ గప్ప—
ఏనా దీనుఁడ నే నీడనైన నొదిగి
మ్రోడునై ఱాయినై నిల్చిపోదు నకట !

# ఆ అ ని ది వ్వో

హృదయనాళము తెగియె, నాహృదయధనము
తొలఁగి పోయెను, జీవితఫలము స్రుక్కి
నేలఁ బడె, నింక జీవింప నేల సఖుఁడ ?
వలపె విషమైనఁ దుచ్ఛజీవనము విషము.

ప్రణయభంగ ప్రభూత తాపజ్వరార్తి
నెటులు భరియింతునో సఖా ? యిటులు మనుచు
కడుభరం బైనవలపుచేఁ దడిసి తడిసి
హృదయ మయ్యయొ ! నవనీతమృదుల మయ్యె.

అతిమనోహరమూర్తి వై యభ్రవీథిఁ
దోఁచినంత నీకై చేయి చాచు టేల ?
శ్రావణ శ్యామలక్రూరజలదపటలి
మాయ మైతె సౌదామినీ ! మమతఁ గొలిపి.

కోపమునఁ జేరి నీ కొనగోళ్ళఁ గూరి
యిట్టె చిఱునవ్వుతోఁ జీల్చి హృదయపుటము

రక్తధారలు స్రావగా ర, మెక్కైన
ని న్నసను, జచ్చినను మన్న నీకె నేను!

జీవితంపునిరాశచేఁ జిక్కి చిక్కి
ప్రాణమే పోయినను నిన్నుఁ బాయలేను!
చాయనై పోయి వెన్వెంట సాగుచుందు,
నీ వెత హరింతు సుఖ మెల్ల నీకె యుంతు.

అవిరతానందముం బొందునపుడు నన్ను
మఱచిపోదువు; సరె యట్టె మఱచిపొమ్ము;
ఘోరదుఃఖతమంబునఁ గుందునపుడు
తెలచి హృదయంబు, నాఱని దివ్వె నిత్తు!

# అయ్యో!

స్వచ్ఛ మైనట్టి ప్రణయంపు సలిలధారఁ
బోసి పెంచిన స్నేహంపుఁ బూలతీవ
తావులను జిమ్మ నలరులఁ దాల్పకుండ
గాలితాఁకున నేలపై వ్రాలె నకట!

సంజవేళలఁ బవడంపుఁజాయలటులఁ
జిఱుత ప్రాయంపుఁ గోరికల్ చెదరిపోయె;
పర్వతశ్రేణి నిర్ఝరపంక్తులట్లు
ఆశయములెల్ల నడుగంటి యంతరించె!

మత్తిలిన యొక్క చంచల మధుపమునకుఁ
గోలుపోయితి మకరందజాల మెల్ల;
ఇంతలో వీచి యెచటికో యెగిరిపోవు
మారుతముతోడ వలపులు మాయ మయ్యె!

నవ్య మోహన కోకిలానంద గీతి
దరవికస్వరసుమమనోహరసుగంధ
మనిలభంగంబులను గొట్టుకొనుచుఁ బోయె
నెచటికో యని చింతిల నేటి కోయి !

నా విరులతోఁటఁ బెంచికొన్నాఁడ నొక్క
పవడపు గులాబిమొక్క నాప్రణయజీవ
నమ్ము వర్షమ్ముగా ననయమ్ముఁ గురిసి.

కొన్ని నాళ్ళాయె; సుకుమారకుసుమ మొకటి
నవ్వె కిలకిల మని నా వనమ్ములోన.

అంత దానినె, నా జీవితాశయమ్ము
పూవుగా వింతగా మాఱిపోయినటులు
వలచికొన్నాఁడ;

నాప్రసవమ్ము నేను
నన్ను మనసార నాప్రసూనమ్ము, కనులు
విచ్చి కాంచుచుఁ గాలము పుచ్చినాము
ఎదల నిశ్శబ్దముగఁ బల్కరించుకొనుచు.

ఎట్టు లది దాపురించెనో యేమొ యంత
నాకుసందులత్రోవల నల్ల దిగియె
నొక్క క్రూరార్కకిరణమ్ము; ఉర్వి వాలి
నాగులాబి సోలి తూలి నన్ను వీడె.

అపుడు నావైపు చూచి నాయలరు లేని
శూన్యమౌ ప్రోడుప్రాఁకును జూచి, యొక్క
కోకిలమ్మ కో యని, యేడ్చె గొంతు నెత్తి !
మాకొాఱకు దారిఁ బోయెడు మందపవనుఁ
డొకఁడు జాలిగ నొక్క నిట్టూర్పు విసరె !

చిన్ని పూవే వాడెనా
తన
కన్నె వలపుల వీడెనా
తన
చిన్నె లన్నియు వన్నె లన్నియు
మన్నులోఁ గోల్పోయెనా ?

కాంతు నెఱుఁగని కన్నె గాదా
సిగ్గు వీడని మొగ్గ గాదా
మొన్న మొన్ననె ముద్దు వల్లిని
మొనలు దీరెనుగా !

## లోకము

ఏటిపని యిది లోకమా! హృదయదళన
దారుణమహోగ్రకార్యంబుఁ దలఁచినావు;
ప్రణయ మధురిమ మెఱుఁగవు, పాప మనవు,
పక్షములు దూల్చి, బంధింతు పంజరాన;
వెఱ్ఱిలోకమ! హృదయంపు స్వేచ్ఛ నెటులు
పంజరంబున బంధింతె? పాదపమునఁ
గూడియుందు మెల్లప్పుడు కొమ్మమీఁదఁ
బ్రవిమల ప్రేమ విహగదంపతుల మగుచు!

## శాపము

నవవసంత శుభోదయానందవశతఁ
బ్రకృతి నూతన జీవలావణ్య మొంద
కాకి అప్పుయుఁ గంఠస్వరంబు దాల్చి
నైజగుణముఁ ద్యజించి గానంబు సేయఁ
బికమ, పాడకు మనుచు శపించినారు!

పక్షి నని పాడఁగల నని ప్రణయవీథి
నిత్య లీలావిహారముల్ నెఱపుదు నని
పక్షములఁ దూల్చి, బంధించి పంజరాన
గానమును ప్రాణము హరింపఁ బూనినారు !

# అబ్బ!

హృదయ వనజాత సుమ
మృదు మనోహర దళము
లదయతను ద్రుంచినారే
పెంధూళిఁ
జిదిమి వెదఁజల్లినారే!

హృదయ శోణిత ధార
నెదుగు జీవిత వల్లి
మొదలంటఁ దూల్చినారే
భయదాగ్ని
కీలలను వ్రేల్చినారే!

రలా

# చుక్కలు

మింట నెచటనో మెఱయు చుక్కలఁ
గంటఁ జూచితిఁ గాంక్ష లూరఁగఁ
గాంక్ష లూరినకొలఁదిఁ జుక్కలె
కాంచి బ్రదుకే గడపితిన్.

చేతి కందెడు పూలకొఱకై
చేయి చాపక చేరి కోరక
దూరముగ లే వంచు వానిని
దూఱి వదలితిని.

మింటఁ జుక్క లదృశ్య మాయెను
చేతి కందెడు పూలు వాడెను
సారహీనపు జీవితమునకుఁ
గోరికల్ మిగిలెన్.

పక్షివలె నాకాశ నిర్మల
పథవిహారస్వేచ్ఛఁ గోరితి

రన

పక్షములు లేవం చేఱుంగక
ప్రాకులాడుచుఁ బొగిలితిన్.

ముగిసి చనె నూఱేళ్ళబ్రదు కిటు
మూఁడు నాళ్ళకె ముక్క లాయెను
మ్రోడు మ్రాఁకై పూయకుండఁగ
దాడి తూలిన తీవయై.

తళుకుబంగరుతార లేలా !
తలకు మీఱిన తలఁపు లేలా ?
వలచి పొందఁగ గగనసుమములు
కలయె జీవితము ?

## ఆశ

కన్నీటి కెరటాల వెన్నె లేలా ?
నిట్టూర్పు గాడ్పులో నెత్తావి యేలా ?
ప్రళయ కాలమహోగ్ర భయద జీమూతోరు
గళఘోర గంభీర పెళపెళార్భటులలో
మెఱ పేలా ?

అశనిపాతమ్ముతో నంబు వేలా ?
హాలాహలమ్ములో నమృత మేలా ?
ప్రబల నీరంధ్రాభ్ర జనిత గాఢ ధ్వాంత
నిబిడ హేమంత రాత్రీకుంతలములలో
చు క్కేలా ?

శిథిల శిశిరమ్ములోఁ జివు రేలా ?
పాషాణపాళిపైఁ బ్రసవ మేలా ?
వికృతక్రూరక్షుధా క్షుభితమృత్యు కఠోర
వికటపాండురశుష్కవదనదంష్ట్రాగ్నిలో
న వ్వేలా ?....కన్నీటి....

# నేనొకండ!

ఎంత బరువయ్యెనో గాని యెడఁద వెలికిఁ
దొలఁగి పాఱని దుఃఖాశ్రు జలము వలనఁ
బ్రావృడంభోధరస్వామి, నీవు కూడ
నావలెనె జాలి వొడమ వాపోవుచుంటి;
ఒక్క టొక్కటె కన్నీటిచుక్క లొలుక
నేడ్వ లేక యేడ్వ లేక యేడ్చుచుంటి,
నెచ్చెలీ, యే నెఱుంగుదు, నీవుగూడ
నొక్కమాఱు గాటంపునిట్టూర్పు విడుతు,
తెలియ రాని తెలుప లేని తీక్ష్ణతాప
మెదియొ లోలోన నిన్ను వేగించునేమొ!

ప్రావృడంభోధరస్వామి, జీవనంపు
భారము తొలంగి పోవ నెవ్వారికేని
కోరి నీసొదలను జెప్పికొందు వేమొ
గొణుగు కొనుచుందువయ్య, యొక్కొక్కవేళ!

గౌరి

ఇట్లై విలపించి కృశియింతు నేను, నీవో
హోరు హోరున నీమనసార నేడ్చి
జిలుఁగువలిపెంపు వన్నె చీరల ధరించి
కులుకు నవ్వులపవడాల తళుకుతోడఁ
బొడుపు చెలికడకో, సంజ పడఁతికడకొ
పోయి యాటలఁ బాటలఁ బ్రొద్దు పుత్తు.

ఎడతెగనియాత్ర నిట్లు సాగింప లేక
యేడ్వఁగా లేక కృశియింతు నే నొకండ !

## దుఃఖము

దినము దినమెల్ల నైదాఘ తీక్ష్ణభాను
భీకరకరానలచ్ఛట వేఁగి వేఁగి
శీతలనిశాప్రశాంత శయ్యాతలాన
నిద్రిత కను మోడ్చెఁ గాదె నాహృదయసుమము !
అలసటం దూలి, నిర్జీవ మటుల సోలి,
జాలిఁ గొల్పును గాదె ? నీ వేల స్వప్న
మటుల లోలోన కలఁచి, చీఁకటిముసుంగు
నొత్తిగిలఁ ద్రోసి, వదలనిపొత్తు గోరి
తొంగి తొంగి చూచెద వయ్యొ దుఃఖమా ! యొ
కించుకైనను జాలి వహించ వేమి ?
సగము వాడిన మృదులపుష్పమ్ము సుమ్ము
నిదుర పోనిమ్ము లేకున్న నేల వాలు !

ఓయీ సంధ్యాసమీరణా, రేయితోడఁ
గారుచీఁకటితోడ దుఃఖమ్ము కూడ
పరువుపరువున నాకొఱ కరుగుదెంచు;
నీదు నునులేఁతఱెక్కలమీఁద పడిగ
నెత్తికొని పోవరాదె న న్నెచటికేని
నిత్యతేజోమయానందనిలయమునకు !
నిముస మేనియు నిట నుండనేర నోయి !

సంజమబ్బుల పవడాలచాయలందో
తరణిబంగారుకిరణాలమెఱుఁగులందో
లీన మొనరింప రాదె యీలోన నన్ను ?
మధుర సంధ్యాసమీర కుమార, దీను
మనవి విని యేగరాదె యేమలయగిరికో ?
మధుర సంధ్యాసమీర కుమార, నన్నుఁ
దోడుకొని యేగరాదె నీతోడఁ గూడ !

ఱెక్కలం దాల్చి పఱతెంచు రేలతాంగి
కారుకాటుకచీర సింగార మొదవ
చీఁకటిచెఱంగు విసరునఁ జెదరి యొక్క
యుడుమణి విషాదపూరితద్యుతులు రాల్చు;
పాడుకొను చేగు జాలిగాఁ బవన మెటకొ
రజనిగర్భాన వింతవిలాపగీతి;
ఎద కరఁగునట్లు సన్ననియెలుఁగుతోడ
నట్టె తల లెత్తి పాట కూకొట్టు చేడ్పు
గౌతమీవీచికాళి సగంబు నిదుర;
నేను నాదుఃఖమే తోడునీడ గాఁగఁ
గడపికొనుచుందు నిశ యెల్లఁ గనులు దెఱచి;
ఇదియె యద నని తలఁచి, నాహృదయపేటి
ముంచుకొని వచ్చు భావజీమూతచయముఁ
గలిపివేతుఁ దమస్వినీగర్భమందు !

## వద్దు

నీ కనుఱెప్పకొనల నొక
చినుకైన కదలనీ,
ప్రళయ కాలానంత భయదపాథోరాశి
వలె విశ్వ మెల్ల ముంచెత్తు సుమ్మా!

నీ పెదవి చివురుల నొక
నిడుదయూర్పు విసరనీ,
కాలాంత బలవదాభీలానిలముగ లో
కాలఁ ద్రుటిలో మాడ్చి వేయు సుమ్మా!

నీ పువుటెడఁద నొక శోక
లవమైన రేగనీ,
ఆ మహానట గళోచ్చలిత హాలాహల
మై మిన్ను మన్ను దహియించు సుమ్మా!

౧౯౭౭

నన్నుఁ గని యేరు జాలిఁ జెందంగ వలదు—
ఎవ్వ రని యెంతురో నన్ను ?—ఏ ననంత
శోకభీకరతిమిరలోకైకపతిని !
కంటక కిరీటధారినై, కాళరాత్రి
మధ్యవేళల, జీమూతమందిరంపుఁ
గొలువుకూటాల, నేకాంతగోష్ఠిఁ దీర్చి,
దారుణ దివాంధ రోదనధ్వనుల శ్రుతులఁ
బొంగి యుప్పొంగి యుప్పొంగి పొరలిపోవు
నా విలాప నిబిడగీతికావళీ వి
రావముల నర్ధరాత్రగర్భమ్ము, మఱియు
మఱియు భీషణకాళికోన్మత్తఁ గాఁగఁ
జేయుతఱి, నన్ను మీరు వీక్షింప లేదో !
నన్నుఁ గని యేరు జాలిఁ జెందంగవలదు—
నాకు నిశ్శ్వాసతాళవృంతాలు కలవు,
నాకుఁ గన్నీటిసరులదొంతరలు కలవు,
నా. కమూల్య మపూర్వ మానంద మొసఁగు
నిరుపమ నితాంతదుఃఖంపునిధులు కలవు—
ఎవ్వ రని యెంతురో నన్ను ?—

# నేను కూడ

ఏను మీవలెనే కంఠ మెత్తి పాడ
నెంతో యుబలాటపడి సవరింతు గొంతు;
ఏను మీవలెనే నవానూనగాన
విస్తృతవ్యోమయానాల వెడలి వెడలి
భావలోకాంచలమ్ముల వాల వలతు !

ఐన నే మాయె ! ఆపుకో లేనిపాట
యెడఁద రొాద సేయునో లేదొ యింకిపోవు
నంతలోననే కటకటా ! యంతు లేని
దారి లేని శోకంపుటెడారులందు !

అంత లజ్జావిషాదదురంతభార
వహనమున కోర్వ లేని యీ పాడుబ్రతుకు
వంగిపోవును మఱి మఱి క్రుంగిపోవు
లో తెలుంగని పాతాళలోకములకు !

మూఁగ వోయిన నాగళమ్మునను గూడ
నిదుర వోయిన సెలయేటి రొాదలు కలవు—
ఐన నే మాయె—

ఇనా

వీఁరుం మనసారఁగా నేడ్వనీరు నన్ను—
నన్ను విడువుఁడు! ఒకసారి నన్ను విడిచి
నంత నేకాంతయవనికాభ్యంతరమున
వెక్కి వెక్కి రోదింతును—విసువు లేక
విరతి లేక దుర్భరశోకవిషమగీతు
లేడ్చియైతు; ఎలుం గెత్తి యేడ్చియైతు.

ఈ మహానంద వీచికాస్తోమడోలి
కాగ్రముల నింక నే నాట్యమాడ లేను,
నేను చిఱునవ్వు పెదవుల నిలుప లేను;
ఏ విరామ మేని లేని యీశుభోత్స
వ ప్రణయకేళికామోద భార మింక
నేను వహియింప లేను; జీవింప లేను!

స్వాదుసంగీతకలనాలసద్విపంచిఁ
గరమునం దుంచి జీవితభరము వాయఁ
బాడుకొ మ్మంటి తియ్యనిప్రణయగీతి
తంతులను ద్రెంచి మెట్ల విదల్చి స్వామి !
ఎటులఁ బాడుదు, నీ బ్రదు కెట్లు వుత్తు ?

స్వాదుమకరందసౌరభామోద కుసుమ
దామ మిడి నాదుకంఠానఁ దాల్పు మంటి;
తేకు తేకులఁ జిదిమి ధూళి వెదఁజిమ్మి,
ఏది మనసార ధరియింతు, నెటుల మనుదు ?

రాజరాజేశ్వరులకు నలభ్య మైన
సదమలామూల్యతారకా సదృశదివ్య
మణివిరాజిత కల్యాణమకుటరాజ
మిడితి నామ స్తకాన వహించుకొనఁగ;
నేలపైఁ బొరలించి పాదాల మెట్టి
యకట ! గిరవాటు వైచి యాశాంతములకుఁ
బేదనై పోయి యెట్లు జీవింతు నోయి ?

ఈ నిశీథమధ్యమ్మున నే నొకండ
ఘోరకాంతార కుటిల కఠోరవీథు
లందుఁ దిరుగాడుదును భయ మందఁ గాని
లోకమోహన తారావిలోకనముల
వలదు కనుసైఁగ చేయఁగా వలదు నాథ!

ఇంచుకేనియు వెఱవ స్వామీ, త్వదీయ
పాణినిర్గత నిర్ఘాతపాతమునకు;
ప్రళయ ఝంఝూ ప్రభంజనప్రబలఘాటి
వడఁకు శైశిరవల్లికా పత్త్రిమటుల
హృదయము చలించు భవదీయవదనసీమఁ
బ్రణయదరహాసకౌముది పరిమళింప!

ఇమ్మహావిశ్వ మల్లలాడించు నీదు
బొమముడిఁ గషాయవీక్షణస్ఫూర్తిఁ జిమ్ము!
బురదలోఁ గ్రుళ్ళి పొరలాడు పురుగు నెత్తి
కొంత, చేర్పకు మోయి నీ కౌఁగిలింత!

ఏను గాటంపు నిద్దురలోన మేను
మఱచువేళల భవదీయ మధురవేణు
మృదులగాన పక్షములపై మెల్ల మెల్ల
నేగుదెంచి మామకశుష్కహృదయపాత్రి
నింపివైతువు ప్రణయార్ద్రనిస్స్వనముల!

అంత మేల్కాంచి యెంతో దాహమ్ము గొన్న
శ్రవణముల విచ్చి నీ గీతరవముకొఱకు
కడలఁ బరికించి శూన్యలోకమ్ముఁ గాంచి
హోరు హోరు మటం చేడ్తు నోయి స్వామి!

# నా కాన్క

ఏది నీ కీర్తి నందువా హృదయనాథ !
కాన్కగా నే మొసంగఁగాఁ గలను నీకు ?

తారకారత్న భాసురతారహార
సుప్రభామాలికాజాల శోభితుఁడవు,
రాజరాజేశ్వరుఁడ వీవు, ప్రభుఁడ వీవు
హృదయపతి వీవు ! భవదీయపదసరోజ
మృదురజోలేశ దివ్యసంపదను వలచి
వీథివీథుల వాడలఁ విపినములను
భిక్షుకునిబోలెఁ దిరుగాడు పేద నోయి !
కాన్కగా నే మొసంగఁగాఁ గలను నీకు ?

గాఢలజ్జానుతాపసంకలితహృదయ
నీరజదళాల రాలు కన్నీటిచుక్క
గాక, మనసార, వల పూరఁ గలఁత దీరఁ
గాన్కగా నే మొసంగఁగాఁ గలను నీకు ?

# క్రుంగిపోదు!

ఎట్లు నిన్నూహసేయుటో యెఱుఁగ లేక
వంగి వంగి శిరము వాంచి క్రుంగిపోదు!
రాజరాజేశ్వర కిరీటరాజఘటిత
రత్నమాణిక్యకాంతినీరాజనార్చి
తాంఘ్రినీరేజయుగళుఁడ వయ్య! చింపి
పాతలం గట్టికొని జీర్ణపటకుటీర
పాళికాప్రాంగణముల నివాస మేల?
శిథిలతరభాజనమ్ము నీచేతఁ బూని
తూలి సోలుచు నిరుపేదతోడఁ గూడి
యూవె దెసమాలినటుల నింటింటి కేగ
నేల? దీనుఁడవై బిచ్చ మెత్త నేల?
చిత్రములు స్వామి, నీ వింతచేఁత లెల్ల!
ఎట్లు నిన్నూహసేయుటో యెఱుఁగ లేక
వంగి వంగి శిరము వాంచి క్రుంగిపోదు!
కలుషబాష్పకల్లోలినీ కణములందుఁ

దళుకు తళుకు కవి నాట్యాలు సలుపు నీ య
నంతరాగాంశుమాలికాకాంతి దేవ !
క్షామదేవతా నిశ్శ్వాస ధూమపటలిఁ
జల్లఁగా వెల్లివిరియును స్వామి, నీదు
భవ్యకరుణార్ద్రవీక్షణపరిమళములు;
చండమృత్యుగభీరగర్జారవములఁ
బల్లవింతువు నవ్యవిపంచివోలె
మాధురులఁ జిమ్ము నీకంఠమంజురవము;
చిత్రములు స్వామి, నీ వింతచేఁత లెల్ల !
మౌనగానమ్ములకు నించు కేని గాని
మాఱు మాటాడఁగాఁ బోవు, మన సొసఁగవు,
శ్రితజనావళినమ్రసంసేవనముల
కలరి తల యూఁప వీవు 'ఊఁ' యైన ననవు;
సార్వభౌములవినయపూజావిధాన
మెడఁద మెచ్చవు, వారిఁ గన్నెత్తి కనవు;
ఎట్లు ని న్నూహచేయుటో యెఱుఁగ లేక
వంగి వంగి శిరము వాంచి క్రుంగిపోదు !

# పాపీ!

మలినబాష్పమౌక్తికమ్ము
మిల మిల నీకనుల నిలువఁ
దళ తళ మని తారలు నటి
యించునురా పాపీ!

వేడి వేడి నిట్టూర్పులు
వాడిన నీ పెదవు లదర
మోదు మ్రాఁకుచివురులతో
మురియునురా పాపీ!

భరియింపఁగ రానిలజ్జ
శిరము వంగి క్రుంగినంతఁ
దెరల దాఁటి చందమామ
నవ్వునురా పాపీ!

"దారి గానలేను స్వామి!
రారా!" యని కంఠ మెత్తి

గగనవీథి గంధర్వులు
పాడుదు రో పాపీ !

కురియుమురా కన్నీటిని !
మఱి మఱి విలపింపుమురా !
సరముఁ గూర్చి పరమేశుఁడె
దాల్చునురా పాపీ !

# కన్నీరు

కలుష దుర్దాంత పంకసంకలితకుహర
ముల జనించు మదీయాశ్రుమలినధార
స్వామి, భవదీయపాదదేశమునఁ బాఱి
పరమపావన జాహ్నవీ ప్రతిభఁ గాంచు.

గాట మగులజ్జవలన దుఃఖమ్మువలన
నా కనుల జాఱునుష్ణాశ్రుశీకరములు
హృదయముఁ గలంచి విదలించి యేర్చి వెడలు
సాంద్రశోణితబిందువర్షమ్ము సుమ్ము !

తావకీనపదసరోజదళములందు
నిలువని మ్మొక్క వేడికన్నీటిచుక్క !
కడలఁ బ్రసరించు నెత్తావి కమ్మదనము
ద్రావని మ్మో ప్రభూ, దానిఁ దనివి తీర !

## మా బాబయ్య, నాన్నగారు : ౧

ఏ మనోహరసీమలం దే పవిత్ర
విమలతేజోమయవిశాలవీథులందు
అక్షరామోదసంభరితాంతరంగు
లగుచు విహరించుచున్నారొ ! అమృతగాన
మధుర మందాకినీభంగమాలికాంబు
శీకరవితానమోహసచిత్రనటన
మెన్ని యెన్ని రీతులఁ జూపుచున్నవారొ !
పూర్ణవికసితజీవితపుష్పకమ్ర
సౌరభములఁ జిమ్ముచున్నారొ ? ఎల్ల
దెసల భవదీయసుందరదివ్యరూప
నవ్యరోచిస్సుఁ గురియుచున్నారొ మీరు !

## మా బాబయ్య, నాన్నగారు: ౨

ఏ నెఱుంగుదు, చిరనూతనానురాగ
బంధములఁ గట్టువడుట స్వప్నములనేని
యెన్నఁడుంగాని యెచ్చోటనేని నిముస
మేని యెడఁబాటు మీరు సహింపలేరు.

ఏ నెఱుంగుదు, రామభూజాని మీరు
కరము కరమునఁ గీలించి కాంతిసీమ
లందు స్వచ్ఛందనిత్యవిహారపరత
మెలఁగుచుందురు కాఁబోలు;

మీ యమూల్య

జీవితసుమాల నేనృపశేఖరునకు
నర్పణము చేసి రట్టిసూర్యావనీంద్ర
చంద్రునొదల నాశిషాక్షతల మీరు
చల్లుచుందురు కాఁబోలు.

## మా బాబయ్య, నాన్నగారు : 3

"జయము, జయము

లలిత సుమనోజ్ఞ కావ్యమంజులలతాంత
మాలికాభరణా ! వినిర్మల విశేష
సుగుణమాణిక్యదివ్యతేజోవిరాజ !
దీనజనహృదయాంతరస్థిరవిహార !
రామరాయేంద్రుశ్రీసూర్యరాయ, జయము !"

అను స్తుతిధ్వానములు జగమంతఁ గ్రమ్మి
యంబరపథాల మాఱ్మ్రోఁగునపుడు మీరు
మువ్వ రొండొరులం గాంచి మురియునపుడు
గర్వమున నృత్యమాడు మీకంటిచూపు
లధరసాంధ్యప్రభల దరహాసరేఖ !
మింట మిల మిల చుక్కలై మెఱయునేమొ !
వెన్నెలై వినువీథుల విరియునేమొ !

## మహాబాబయ్య, నాన్నగారు : ౪

మీ పవిత్రయశోనిర్మలాపగాతి
శీతలతరంగజలసుధాసేచనమున
కలుషకౌటిల్యకర్దమమలిన మైన
మీ తనయు జీవితముకూడ పూత మయ్యె !

మా బాబయ్యా, నాన్నగారు : ౫

నాఁడు గొం తెత్తి మీరు గానమ్ముఁ జేసి
నారు భువనాలు తమ శ్రవణాలు విచ్చి
'ఔ' నటంచు 'ఓహో' యంచు నాలకింప
విస్మయాధికసమ్మోదవిభ్రమమున.

అంత హరిదంతములఁగూడ నతిశయించి
పొరలిపోవు మీ గీతమాధురుల శ్రోఁత
తనవిపంచీమనోజ్ఞనిస్స్వనము ముంపఁ
గనుబొమల నెత్తి మో మెత్తి కడలఁ గాంచు
భారతీదేవి యంగుళుల్ పాడ వంట !

దరనిమీలితదివ్యనేత్రములతోడ
నపుడు మీ పాటలోని యనంతసూత్న
రక్తి కలరి కవీంద్రసమ్రాట్టు లేఁత
నగవుతోడ శిరఃకంపనమ్ము సేయ
విశ్వ మెల్ల శంపాప్రభల్ విరిసె నంట !

## మా బాబయ్య, నాన్నగారు : ౬

ఎన్నఁడో మీరు పాడిన దీవసంత
మధురజీవనగీతి హేమంతదీర్ఘ
యామినీ మధ్యవేళయే యైన నేఁడు
కూడ నాయెదఁ ద్రుళ్ళింత లాడుచుండు;
నవ్యభాగిరథీ దివ్యనదివిధాన
నేఁడుకూడ నోత్సవనృత్యమాడు లోన,

పొంగి పరవళ్ళు ద్రొక్కి యుప్పొంగి పొరలు
నీయమృతపూర్ణ సురవాహినీతరంగ
శిఖరముల నాడు నొకకొన్ని చిన్న చినుకు
లీహృదయగహ్వరము దాఁటి యీగళమ్ము
నతిశయించి పైపయిఁ జిందులాడుచుండు.

కనులు విచ్చి మనసు విచ్చి కాంచఁగలుగు
వారు తల యూఁచి మెచ్చుచున్నారు వాని.

ప్రాజ్యపీఠపురీమహారాజ్యభాగ్య
లక్ష్మి కొలువు దీర్చు చిన్నరత్నఖచిత
భాసమానకల్యాణసింహాసనమ్ము;
అది వెలమ శౌర్యమూర్తి రణావనీ వి
హారవిక్రమకేళికానంతరమ్ము
శాంతి నుండు విలాసవిశ్రామవేది;
అది సభాసీనసకలబుధావతంస
ఘనకవీశానవిజ్ఞానకాంతిమత్ప్ర
సన్నవీక్షణస్నాపితస్వర్ణపీఠి;
అది మహీపతి రామరాయావనీంద్ర
కరకమలవీజ్యమానచామరసమీర
పులకితభవన్మృదుశరీరభూషితంబు!

నాకు మరణమ్ము వల దనినాను, కాని
మరణ మను లేఁతనుడి చెవిం బడినయంత
వడ వడ వడంకఁగా శిలాజడిమఁ గనఁగఁ
దలిరుగాలికి శుష్కపత్త్రమ్ము కాను.

తుది మొదలు కాని కానరానిది; మహాంధ
కారకలుషిత కృష్ణపక్షంపువీథిఁ
గరముఁ గరమునఁ గీలించి కలసి మెలసి
మన్న సహధర్మచారిణి, మధుర మధుర
మూర్తి, ప్రియురాలు, సఖురాలు, పూర్ణరాగ
కలిత, నాదుఃఖ మసువులే తొలఁగిపోవ
వీడిపోవు నేమో యను వెఱపువలన
నాకు మరణమ్ము వల దనినాను—

# ప్రతీక్ష

నాఁటితుది సందెచీఁకటికాటుకల వి
లీనమైపోవురాజమార్గాన నీవు
కదలిపోతి విషాదసుఖమ్ముఁ గూర్చి
సగమునిద్దురలోఁ గ్రమ్ముస్వప్నమటులు.

ఆపుకోలేనిమమత, ఘంటాపథమ్ము
నడుమ పరువిడి నిలఁబడినాఁడ నట్టె
విచ్చికొనిపోవువీక్షణవితతితోడ
మూసికొనిపోవుశూన్యహృత్పుటముతోడ.

ఆనిగూఢప్రశాంతసంధ్యాదురంత
గర్భకుహరాంతరమ్ములఁ గలఁచిపోవు
క్రమభవదీయమంజీరకటకగాన
రవముచేఁ దిమిరమ్ము సాంద్రతర మయ్యె.

ఆయగమ్యతమస్సాంద్ర యవనికాంత
రంపు టేకాంతమునఁ బడి, యాక్రమక్ర
మాస్త్రమితనూపురారవాహ్వానములను
వెంట నంటి, నాహృదయము వెడలిపోయె.

ఆసరణి, నేను ప్రతిదివసావసాన
సమయమున నీవు పోయినచక్కి చూపు
లట్టె పఱపుచు శ్రవణాల నట్టె తెఱచు
చెదురు చూతు నీకొఱకు నాయెడఁదకొఱకు.

ఇదె వచ్చుచున్నాను ప్రియురాలా !
ఇఁక నిలువలేను నా ప్రియురాలా !

చిరకాల మీ యెడఁదచెఱలో నిమిడి నేఁడు
పొరలివొంగెడుదుఃఖ ఝరులపైఁ బరువెత్తి
ఇదె....

ఈ విరహసంతాప మీ ప్రవాసక్లేశ
మేపగిది సహియింతు నెటులు జీవింతుఁ !
ఇదె....

అవలిదరి నీపిలుపు పవలు రేలును మ్రోయ
మివులతొందర నసువు నవసి తపియించుఁ,
ఇదె....

శూన్యలోకము దాఁటి శుష్కదేహము దాఁటి
యన్యోన్య నిబిడ నిత్యాశ్లేషకాంక్షతో
ఇదె....

# నిర్యాణము

చల్లఁగా నున్న దీసుప్రశాంతవేళ
చల్లఁగా సాగు నీసుప్రశాంతపథము;
బయలుదేఱుము దూరంపుఁ బయనమునకు
వలదు తడయఁగ, ద వ్వేగవలయు నేఁడు.

నవనవోల్లాసమధురగానంబు వలదు
ప్రవిమలానందచంద్రికల్ పనికిరావు
అల్లనల్లన గొం తెత్తి యాలపింపు
పరమపదశాంతిపూర్ణనిర్యాణగీతి.

ఒక్క టొకటె యదృశ్య మౌఁ జుక్క లెల్ల
అల్లనల్ల నాశలుకూడ నంతరించె;
తిమిరమో దివ్యతేజమో తెలియకుండ
నాకసంబటు వెఱఁ గయ్యె లోక మెల్ల.

వెడల లేక వెడల లేక వెడలు చెలికి
వీడ్కొలుపు లిచ్చు జాలిగా విహగకులము,

ఆపుకో లేక పొరలు సంతాప మెల్లఁ
దరళతుహినాశ్రుధారలఁ దరులు గురియు.

ఎన్నఁడును లేని రీతిఁ దోతెంచె నేమొ
మెల్ల మెల్లన మాంద్యముఁ జల్లదనముఁ
గలిగి నునులేఁతగాలులు కవికుమార !
ఎచటి కేగుచునుంటివో యేమొ నేఁడు !

స మా ప్త ము

ఓ మానవోత్తమా ! ఓ వీరమూర్ధన్య !
ఓ యమృతభాసమా
నోన్నతప్రేమసామ్రాజ్యైకచక్రవర్తీ !
స్నేహాశీలి !

నీ హృదంతికములో నిరుపమానాఖాత
రత్నాకరామూల్య రాగసంపద మెఱయు !
నీ యాశయమ్ములో నిర్మలోత్తుంగ ది
వ్యాకాశసంకాశ భాగ్యరాసులు మెఱయు !

ఈ యశ్రుఝరులతో, ఇరులతో, రొదలతో
సొవలతో, ఈ హాస మృదులవాసనలతో
విసముతో, సిగ్గుతో కొసరు తేనియలతో
ఈషాటి బ్రతుకు నీ కేపాటి దోయి, నా
నెచ్చెలీ ! నెచ్చెలీ !

దారులన్నియు మాపె దశదిశలు ముంచెత్తె
నీరంధ్రభయదాంధకారజీమూతాళి;
ప్రేయసీ, ప్రేయసీ, వెడలిపోయితి వేల
ఆ యగమ్యతమస్వినీగర్భకుహరాల ?

ఆ యజ్ఞాతంపు టేకాంతమ్ములో ప్రోసి
మాయమై మెల్లఁగా నీ యడుగుసండడులు
నా యెడఁదత్రోవనే పడి నడచినట్లయ్యె;
నా యెడఁదలోననే మాయమైనట్లయ్యె !

అంత నా గొంతులో 'హా ప్రియా' యను కేక
అంతంత దివి కేగి, అంతంత దిగి పోయె;
తారలే కను విచ్చి తమములే శ్రుతి విచ్చి
ఆ రవము విని నన్నుఁ గని జాలి నొందాయి.

నాఁటినుండియు నేను ప్రతి నిశీథతమంపుఁ
గాటుకలచాటు నొరు తే రరయ లేనితఱి
చూచికొని చూచికొని శూన్యహృదయములోని
'కో చెలీ!' యని క్రుంగి క్రుంగి యేడ్తును సుమా!

సడిలేని నడిరేయిఁ బడిపోయి నట్టి నీ
కడియాల రవళులే చిరుగాజు మ్రోఁతలే
వ్రే లెత్తి చూపు జీవితపథమ్ములు నాకు;
కే లెత్తి నడిపించు, నెల్గెత్తి న న్బిలుచు !

అపుడు గొంతెత్తి యేడ్చినాను; అపుడు నన్నుఁ
గాంచఁగా నోపఁగా లేక కన్ను లట్టె
యార్చికొనినవి తారకలు; అపుడు మొగిళు
లల్లనల్లన నలనల్లనై భరమ్ము
లైన నిట్టూర్పుదొంతర లైనవి; అపుడు
కుంచుకొని కుంచుకొని కుహూకుహారవాటి
ననుఁ దొలఁగి దవ్వు దవ్వులు చని శిరాలు
వాల్చికొనినవి తిమిరాలు భయవశాన;
అపుడు బ్రతు కొక్కటే యేడుపైన గాలి
రిచ్చవడి వట్టి పసిపాపలీల మౌన
యానమునఁ బాఱి సుప్తపత్రాళి నొదిగి
పొంచి చూచుచు చలియించి పోయినాఁడు;
అప్పు డీవిశ్వమే నిత్యయాత్ర నాఁగి
శ్రవణములు మూసికొనినది; రాక రాక
నా గళతమఃపథమ్ముల రేగి రేగి
రోదనోచ్చలితోచ్చగీతా దురంత
దుస్సహార్చులు వెడలి రాఁగా....

ఇపుడు ప్రళయమ్ము క్రమ్మిన దేమొ, కాక
దొరకదో నిల్వ నీడ నాచిఱుతపాటకు,
ఇంత యిరు కౌనె యిమ్మహానంత విశ్వ
మలమికొను చీఁకటుల కలకలమువలన !

ఎటు గనినఁ గాని ఆకాశ హృదయవాటి
సంకుల విషాద జలధర చ్ఛాయ లందు
పొంచు బాష్పాంబునిధులు ఘోషించు; నెగుర
పక్షములు దాల్ప వెఱచు నా పాట నేఁడు !

దశదిశలఁ జీల్చికొని రేగు దారుణ ప్ర
భంజ నోచ్చలి తోన్మత్త భంగ వీథి
నెగయు, నయ్యయో, లోకేశు నెడఁద వెడలి
యేడ్పు సందడు లెగయూర్పు లేర్చు పొగలు;
పొంచి పొంచి నాలో మూల మూలలందు,
క్రుంగి క్రుంగి యడంగి దాగుండు గీతి !

స్థాణు వయ్యెనొ, పాషాణ జడభరమ్ము
గనెనొ, కదలదు మెదలదు కంఠరవము,

నేఁ డిదేమో క్షమాజననీపురాణ
గర్భకుహరమ్ము విదలించి కారుచిచ్చు
ఔఱుపుమంట మూలుం గేదో యేదో ప్రాఁకె....
ఇపుడు ప్రళయమే !....

ఈ పయనపుం దెరువు ఇరుదెసల శిర సెత్తు
ప్రతికుజము ప్రతిసుమము ప్రతివిహంగమరుతము
అంతలో నా హృదయమందు సంజీయకావి
వింతలై నశియించునా, నా బ్రదుకు
సుంతేని సహియించునా !

అంతమే లేని నా యాత్రాపథాన నా
పదచిహ్నములు వోలె పడియున్న వెన్నెన్నొ
అడుగుజాడలు మదీ యార్ద్రహృదయమ్ములో
నిశి కడుపులో తారలై, నిశ్శబ్ద
వాటిలో చిఱుపాటలై !

వెను దిరిగి కను విసిరి వీక్షింతునా అంత
ప్రతిపద మ్మమృత జీవప్రతిభఁ బులకించి
పలుకరించిన క్రొత్త బలముతో చలముతో
పడి నడతు పవలు రేల, అజ్ఞాత
భానికాలపు యుగాల !

వెదకి వేసారి నా వెఱ్ఱిబ్రతు కెపుడేని
తుదిరేయి కను మూయునా,
బేలయై
నిదుర బరువుల క్రుంగునా,
మఱపు మసకల దారి తెఱచికొని కల యేదొ
విసిరికొని పరతెంచును,
కారు రా
తిరికొనల మెఱపించును.

కలఁగి తొట్రిలుచు నాఁకలి తొందరల సోలు
కరము లట్టే చాతునో,
నా మంచు
కనుల నట్టే తెఱతునో,
అంతలో నింతలో నడుగుజాడయె లేక
వింతకల కరఁగి చనును,
నాకు నా
వంతకథయే మిగులును.

వనరు చేద్వఁగ లేను, చచ్చి చావఁగ లేను
కన లేని వెలుఁగు కొఱకై
ఎన్నఁడును
కన రాని దాని కొఱకై.

ఒక క్రొత్త బరువుతో ఒక క్రొత్త యాసతో
ఒకఁడనే పడిపోదును,
శూన్యమున
ఒకఁడనే కృశియింతును.

ఇది నిశాంత తమఃక్రాంత మిది దరిద్ర
మీ నిశాంతమ్ము శూన్య, మిం దెన్నఁడో ర
హ శ్శిథిలసుప్తిఁ గలవర మంది లేచి
గుబులుకొను లేఁత నెత్తావి గుసగుస లెవో!

అంత నీ యంధమందిరమందు నొక్క
రెప్పపాటు వేకువ ఒక్క రెప్పపాటె
ఉన్మిషిత జీవనాగమనోత్సవమ్ము
ఉదిత గీతాప్రవేశ ముహూర్త వేళ!

అప్పుడే గృహనేత్రవాతాయనముల
కొలుకులందు లేవెలుంగు తళుకుఁజివురు
లరుణ మసృణ తోరణ పంక్తు లల్లు నేమొ
ఆడు నేమొ వాడిన మోము లట్టె వాల్చు!

తెఱచికొన్న ద్వారముఁ జొచ్చి విరిసికొన్న
వాకిలిం జేరి, మంగళవాద్యపాళి
గద్గదిక వోవ సవరించి గళము పాడు
నేమొ నిర్జీవ నిశ్శబ్ద మిట్టె మూఁగు!

నార్ల

మరల గ్రుడ్డిరాతిరి పడు, మరల నోరు
కాని శ్రుతు లేని లేని చీఁకటులు మరల
మరల పాడిల్లు....

నా కుగాదులు లేవు
నా కుషస్సులు లేవు
నేను హేమంత కృష్ణానంత శర్వరిని.

నాకు కాల మ్మొకక్రౌ-
ఞ్చే కారురూపు, నా
శోకమ్ము వలెనె, నా
బ్రతుకువలె, నావలెనె.

కాని

ప్రేయసీ! ప్రేయసీ! ఓ యమావాస్యా త
మస్వినీ! గగన సీమంతినీ! నాసఖీ!
నీ దీర్ఘ ధమ్మిల్ల నీలవల్లీచ్ఛాయఁ
బొడిచికొని, నిదురచెఱ విడిచి, పూవులు నేఁడు
మరుగుహృదయాల నా కౌఁగిలి తళతళ పాడు;
సురభిళాహ్వానముల్ పఱపి న న్గలఁచి దు
ర్భరదురంతావేగపరత వెఱ్ఱిని జేయు!
నా సఖీ! నా సఖీ! నే నోపగా లేను!
నీ కైశికధ్వాంత నిశ్శబ్దముం జీల్చి
నా కౌఁగిలికె, నా కౌఁగిలికె, నా శర్వరీసతీ!
కోటి నవమల్లికలు కోటి కన్నులు విచ్చి
విరహావీక్షణభయంకరమాధురుల నన్ను
పలుకరించిన, చెలీ పులకరించిన బ్రతుకు
వేఁగిపోవునొ, యేమొ! ఆఁగలేనో, యేమొ!
నా సఖీ! నా సఖీ! నే నోపగా లేను!

నీ కుంతలములలో నాకై శిరసు లెత్తి
ననుఁ బోల్చుకొన్నవో ! ననుఁ బిల్చుచున్నవో !
నటియించు ఆ పూవు లెటు నవ్వుచున్నవో !
తురిమి విసరుము వాని ఎఱుఁగ నేరని దూర
దూరాలకో, రహస్త్రాలకో, చెలీ !
కప్పికొందున కనులు ! కప్పఁగలనా యెడఁద ?
నా సఖీ ! నా సఖీ ! నే సైఁపగా లేను !
ఓ నితాంతవియోగినీ ! ఓ నిశీథి
నీ ! కఠోర ప్రణయశాలినీ ! క్షమింపు !
చాలు, నాసఖీ, నీ ప్రేమశాప, మీ య
పూర్వనారకయాతనాఖర్వతాపము !

వినరా వీ విభావరీ
వేలా శాలల నీ మృదు
వసనాంచలముల గుసగుసలో,
మసలు చరణ మంజీరము
కొసరు జాలి పలుకరింతలో !
ఈ కుటీర ముఖద్వార
మిందే వ్రేలాడి సగము
వాడి, విరహ తోరణమ్మనై
వలవంత సడలి నేల జీ
రాడి యెన్నినాళ్ళు మనుదునో !
ఇపుడు వత్తువా నీ కొఱ
కెదురు చూచు నీ వియోగి
యెడఁద మంచుజడులు కురియును,
మా పేమో, రే పెటకో
వెడలి చనునో, నిదుర మునుఁగునో !
ఆరలేని నా కోరిక
కారుచూపు చొఱఁగ చీలి
కాలి కుములు ఈ చీఁకటితో
క్రాగి క్రాగి నీ కొఱకై
కరువులోననే నశింతునో !

నాలా

నీ మనోజ్ఞ కాంచన కోం
చీమణి ఘంటా గళములు
ఏకాంతము కరఁగ మ్రోయఁగా
వినన నలచేబ్రదుకుఁ దాల్చి
యెడఁద మ్రోఁత కెంత యేద్తునో !
ఈ వియోగ నిరాశా క్ష
ణ క్షణ ప్రతీక్ష చెదరి
ఎగసి ఎగసి పగిలిపోదునో !
పగ లెఱుఁగని ప్రవాసమున
కిఁక వేకువ రేకు విరియదో !
ఆకస మాలోకనముగ
లోక మెల్ల వీనుగ కా
లాంతమునకు కాచి యుందునా !
ఆస లేని ఆసకు ప్రా
ణాంత మేని వేచి యుందునా !
చివురింపదొ చైత్రశుభో
త్సవ విభాతకల్యాణము
ఈ దరిద్రహేమంతమున....

౯౯

నా నివాసమ్ము తొలుత గంధర్వలోక
మధురసుషమా సుధాగానమంజువాటి,
ఏ నొక వియోగగీతిక,

నేను నిదుర
వెన్నెలలదారి నొక రేయి వెడలిపోతి
నొక విపంచి విరహాకంత మొరసి యెగసి.

ఏ నొక వియోగశాలినీ హృదయరాగ
వేదనారేఖ, నాకలి వేగు నామె
యంగుళీకిసలయ చంచలాంచముల
విడివడి యనంతవిశ్వానఁ బడితి నాఁడు.

అదియె మొదలేను సకల దిశాంతరాళ
మెల్లెడల నెందుకో పర్వులెత్తి పోవ!

ఆ సమయ మాదిగా నప్సరోంగనాను
రాగవీథుల, కిన్నరీరమ్యకంఠ
సీమలో, శ్రావణాంబుదాశ్లేషపాళి,

తారకాలోకపంక్తుల, మారుతోరు
పక్షముల, తిరుగాడుచు పవలు రేలు,
కన్ను మోడుపు మెయి వాల్పుఁ గాని లేక !

ఇది ముగియఁ బోని ఏ యర్థ మెఱుఁగరాని
వేసటే లేని వెఱ్ఱియన్వేషణమ్మ !

ఈ ప్రవాసయాత్రారతి నిటులె నేను
కదలిపోవుదు నాశావకాశములను
ఒక్క నిట్టూర్పు వోలిక, ఒక్క మౌన
బాష్పకణ మట్టు, ఒక గాఢవాంఛ పగిది.

ఏనొ తొలుత నే గూఁడేని లేని పులుఁగు
రాయఁడ, వహించినాఁడ నా బ్రతుకుబాట
నాట నవయని ఱెక్క యుయ్యాల కొనల
తెరువె లేని, తీరమె లేని దివ్యసీమ !

అంత నే మాఱిపోతి సంధ్యామనోజ్ఞ
చిత్రసిందూరరేఖగా, చేయిఁ జెయిగ,
మెయి మెయిగ, హాయి హాయిగా మెలఁగినాను
పైఁడివన్నియతో నీలినీడతోడ !

నేను మెలమెల్ల రిక్కనైనాను; కాని
ఆ విశాలవినీలసౌధాంతికమున,
ఉండఁగలనా ప్రవాసినై ఉడుసఖాళిఁ
బలుకరింపక యొక రెప్పపాటువేళ !

ఇపుడు నే నొక్క తుదిరేయి యిరులచాయ
నెగసికొని చిమ్ముకొని నటియించుకొనుచు
అలము వెలుఁగుల పరువుల కులికి పాఱి
కుంచుకొని రిచ్చవడి క్రుంగి క్రుంగి యలసి
యిపుడు నే నొక్క తుదిరేయి యిరులచాయ
నై నశించుచున్నాను....

ఎన్ని యెన్ని నిశ్వాసము లెగసినవియొ
ఈ బ్రతుకె రూపుమాసిపోయినది గాని,
ఇంతవిశ్వమ్ములో జాలి యింతనీడ
ఒదవగా లేద యొక్క నిట్టూరుపునకు.

కంటఁ గురిసిన కార్చిచ్చుమంట యేళ్ళ
కాలి నుసియై నశించె వాంఛాలవాలె;
ఏ రెఱుంగుదు రని ఏ యెడారిదార్ల
నింకెనో చుక్కతడి జాడయేని లేక.

కరుణపట్టున నీ బిచ్చగానిచేయి
చాచికొనినాఁడ మృత్యుఘోషమ్మె మఱచి;
వట్టిబయలున నొక మ్రోడుచెట్టు వోలె
ఎత్తినది కర మెత్తినట్లే కృశించె.

కనులు రెండును బండిచక్రమ్ము లయ్యె
చనువుచూపున కెఱుకనవ్వునకు వెదకి;
ఎందులకో వెఱ్ఱిమదివోలె నిపుడు తిరుగు
చూపులే లేక అజ్ఞాత శూన్యసీమ.

స్వాగతాశ్లేషమున విడఁజాలు నెదల
నల్ల ద్రావితి మున్ను దోసిళ్ళకొలఁది;

వలపుటాకలి స్రుక్క నా బ్రతుకుమీఁద
ఇనుపపాదాల నిడి లోక మిపుడు నడుచు.

ఆశయమ్ముల ఆనందలేశముల, అ
లంతియాసల జీవితమంత్ర, ఇట్లె
యేడ్పువైచిత్రి, వినువారె యేరు లేక
యేడ్పుసందడి నాలోననే చెలంగ!

వడవడ వడంకిపోదు జీవనపుఁ గొనల
నెన్నఁడే నాసకళ తల యెత్తెనేని,
ఉభయసంధ్యాంచలముల నేదో వెలుంగు.
కలుగ కలవరపోవు ఘూకమ్ము వోలె.

మింట వెలుఁగుచుక్కఁ గన్న మిణుఁగు రన్న
నేను సహియింపలే, నవ్వి యిరులు చెఱుచు;
నాకు ప్రాణమే మెఱుపులే లేక యున్న
భాద్రపదమాసమున నమావాస్యరాత్రి!

రేయి కడుపున చీఁకటి చాయ వోలె,
తమసుబెడఁద దివాంధ గీతమువిధాన,
ఘూకరావాన వలవంత రేకరీతి
నావిషాదమ్ములో దాఁగినాఁడ నేనె!

ఏను మరణించుచున్నాను; ఇటు నశించు
నా కొఱకు చెమ్మగిల నయనమ్ము లేదు;
పసిఁడివేకువపెండ్లిండ్లఁ బడిన యెవరు
కరఁగనేర్తురు జరఠాంధకారమృతికి ?
నా మరణశయ్య పఱచుకొన్నాను నేనె !
నేనె నాకు వీడ్కొలుపు విన్పించినాను !
నేనె నాపయి వాలినా, నేనె జాలి
నెద నెద గదించినాను, రోదించినాను !
బ్రతికియున్న మృత్యువునై ప్రవాసతిమిర
నీరవసమాధిఁ గ్రుళ్ళి క్రుంగినపుడేని
నిను పిలిచినాన, నా మూల్గునీడ ముసిరి
కుములు నేమొ నీ గానోత్సవముల ననుచు ?
ఇదియె నా చితి, పేర్చితి నేనె దీని
వదలిపోని నా యవసానవాంఛ గాఁగ;
వడఁకని కరాలు రగులుచు దుడుకుచిచ్చు
లాలనల నింత నుసి గాఁగ కాలు త్రుటినె !
అలయు వాతెర యూర్పుగాలులు కదల్చి
రేపు నంతె నా కాష్ఠాల రేగు మంట
మను బ్రతుకునట్లు నా దేహమును దహింపు !
పడదులే ఆర్పఁగా నొక బాష్ప మేని !

ఎవ రోహో, ఈ నిశీథి నెగసి, నీడవోలె నిలిచి
పిలుతు రెవరొ. మూగకనులు మోయలేని చూపులతో
ఎవ రోహో! ఎవ రోహో!

ఇపుడా నను( బలుకరింతురు!
మోయలేని నీరవగళమ్మున( జలించు కోరికతో
ఇపుడా నను( బలుకరింతురు!

ఎవ రని ఈరేయి నిదుర హృదయ మదర, వేయిచేయి
చాయ లాడ పెనుచీ(కటి సైగలతో నా కన్నుల
రక్త మురల లాగికొందురు!
ఎవరో, నా హృదయనాళ మేలా తునియలుగా నా
నిర్జీవపుజీవితమ్ము నిట వదలుదురా!
ఎవ రోహో! ఎవ రోహో!
ఇపుడా నను( బలుకరింతురు?

నా కఠిన పాదశిలలక్రిందఁ బడి నలఁగి
పోయె నెన్నెన్నియో మల్లెపూలు మున్ను.

ధూళి కై వాలు మౌళిపైఁ దాలిచికొన
ఇంత విరిదోఁటలో నపు డెంత వెదకి
వేచియున్నానొ, విసువని వెఱ్ఱి కోర్కె
తొందరల చూపు లటు నిటుఁ దూలినంత
హృదయముల నయనమ్ముల బెదరు కలఁత
మూసికొనఁబోని యొక ననముగుద లేదు.

నా కనులు క్రాగు చీఁకట్లు ప్రాఁకుచోట
లేదు నెత్తావి, మధువేని లేదు, లేదు
ప్రాణ, మొక్క లావణ్యలవమ్ము లేదు;
ఏను రుజనైతి, జరనైతి, మృత్యువైతి!

ఈ నిశావసానమ్మున, ఏ శుభాని
లమ్ము నిట్టూర్చెనో జాలి రాఁగ నేఁడు
వాలె నా పాడు అడుగులమ్రోల నొక్క
తారయే, యొక దివ్యమందార సుమమె !

మోహినీహాసమల్లీప్రఫుల్లరుచియె,
శ్రీలలితవైజయంతీపరీమళమ్మె,
హరజటాపారిజాతలతాంతమధువె,
నిర్దయానిశితమ్ము లీ నీచనఖర
ములకొసలె కోరి పరవశమ్మున చలించె !

ఇటు వడఁకు కేల దీని స్పృశింపలేను
వెరగు కనురెప్ప రేకుల విరియలేను,
ఎటు లదిమికొందు నా మ్రోడుటెడఁద ఎటులు
చెరగి నెరసిన చింపిరికురులఁ దాల్తు !

ఇది విభాత మహోత్సవ మ్మొ ! ఇదియు
నూత్నకళ్యాణతూర్యమనోజ్ఞగాన
నృత్యకోలాహలమ్మొకో ! ఇది సువర్ణ
మంగళాక్షతాశీర్వర్ష మగునా, కాదో !

ప్రేయసీ ! సుఖస్వప్నదరిద్ర మైన
బ్రతుకు నాది, నిద్దురపోవు వల్లకాదు;
నమ్మ గోరని బరువునేత్రమ్ము లెటులు
నులిమికొానునో, పాపము, మేలుకొాలుపె మఱచి.

త్రిజగతీపతి కోటీరదివ్యరత్న
రాజి నేలు వజ్రాలతురాయి వీవు !
ఏనొ పాతాళలోకంపు టిఱుకుసందు
లందు దిగఁబ్రాఁక వెఱచు గాఢాంధరేఖను !

తారకాపూర్ణచంద్రమార్తాండబింబ
మండితమ్ము మహాకాశమంటపమ్ము
నందె కాదె పాణిగ్రహణమ్ము దొరకు
పతిత వెట్లాదు ? నే నెటుల పక్షి నౌదు ?

ఇన్ని కల్పాలు కాలు నాయెద నడంగి
నాకు ప్రాణమై యగు వేదనాసుఖమ్మ
ఇదె పలుకరించు నా సఖీ ఇపుడు నీ య
పూర్వకరుణార్ద్రనీరవమూర్తి యగుచు.

నే కురియ లేని మూగకన్నీరు యుగయు
గాల నేత్రాల యశ్రువర్షాలు కడుగ,
చల్లగా జాలిజాలిగా శాంతమధుర
ముగ నుషఃకాలకౌముదిసొగసు వైతి !

నీవు తొలిప్రొద్దు నునుమంచుతీవసొనవు
నీవు వర్షాశరత్తుల నిబిడసంగ
మమునఁ బొడమిన సంధ్యాకుమారి, వీవు
తిమిరనిశ్వాసముల మాసి కుములు శర్వ
రీ వియోగకపోలపాళికవు నీవె,
నీవె నిట్టూర్పు, నీవె కన్నీరు, విశ్వ
వేదనామూల్యభాగ్య మీవే నిజమ్మ;
నే గళ మ్మార పాడుకొనిన యఖాత
శోకగీతమ్ములం దీవె శోకగీతివి !
ఊర్వశీ ! ప్రేయసీ !

నాఁడు 'శాఫో' విరహకంఠనాళవేణు
వాలపించిన యరుణారుణాంధగీతి
యేడ్చు, నిట్టూర్చు, కోపించు నిపుడు సంధ్య
యటుల, కాలవిశాలవిహాయసమున !

ప్రేయసీ ! 'వీని కృపణజీవితగణమ్ము
ఎండ వానల చివికిపోయినది, జీర
వారునో, మూగవోవునో, వడఁకి వెలితి
యౌనో, పాడదో' యను సందియమ్ము వలదు.

నాఁటి యమవసకన్నీటిపాట యేనె
యేడ్చినది, మింటిచూపుల కెగసి మాపి,
క్రుంగి యజ్ఞాతపాతాళకుహరములకు,
పఱచు నిశ్వసించుచు భావిపథము లంటి !

ఊర్వశీ ! ప్రేయసీ ! నేఁడో, యుష్మదీయ
చరణకరుణామధుకణమ్మొ దొరకు నేమొ.
మూఁడులోకాలసుఖ మొక్కముడి నిమిడ్చి
విసరలేనో కాలాంతమే వెనుక ప్రాఁక !

ఊర్వశీ ! ప్రేయసీ ! నేఁడో, యుష్మదీయ
చరణమసృణారుణోదయసురభికాంతి
పలుకరించున, సోకునా, తళుకు మనున,
ఆరని వెలుంగె నా గీతికాంతికములఁ
జేర్చికొని, కూర్చికొని, భవచ్ఛ్రీవిలాస
హాసవాసనావేశము లందికొనఁగ
రమ్యహిమవాలుకాచ్ఛ నీరాజనముగ
ఈయనా, నాసఖీ !....

కాలమే పసిపాప కనువిచ్చిన యుషస్సు
కలగా కలవరించి వెలుఁగుగా పులకించి
ఇరులకడు పొరసి నే తెఱచి వాలిననాఁడె
మిసిమివన్నెలమేన మసి జాలిగా నయ్యె....

తొలివియోగిని నేనె!
తొలిప్రేయసిని నేనె!

ఆనాఁటి కీనాఁటి కేను నీదాననే!

మున్నీటి తరగలకు మిన్నేటి నురుగులకు
తడయునెడఁబా టేనె! విడనికౌఁగిలి నేనె!
వానచినుకుగ సొగసి వలపుచూపుగ నెగసి
పడిపోవుదును నేనె! పరువులిడుదును నేనె!

తొలివియోగిని నేనె!
తొలిప్రేయసిని నేనె!

ఆనాఁటి కీనాఁటి కేను నీదాననే!

హాలాహలానలమె అమృతశీతలరసమె
తోడుబుట్టులు నాకు! తోడునీడలు నాకు!

౧౧౫

నిశినీలిపెదవిపై నిట్టూర్పుగా ప్రాకి
తొలిప్రొద్దుచెరగులో పలుకరింతగ సోకి....

తొలివియోగిని నేనె !
తొలిప్రేయసిని నేనె !

ఆనాటి కీనాటి కేను నీదాననే !

వేయివేలుయుగాలు రేయినై పవలునై
అడరి కురిసినయేడ్పు అలరి విరిసిననవ్వు
బరువుకానుకగ, మన భాగ్యబంధమ్ముగా
చేర్చికొని నాలోన మూర్ఛితిని నీకొఱకె

తొలివియోగిని నేనె !
తొలిప్రేయసిని నేనె !

ఆనాటి కీనాటి కేను నీదాననే !

కలకాల మలయకే నిలువునా తెఱచుకొని
ఎదు రరయు నీ వలపుటింటి ప్రాంగణములో

తొలిప్రేయసిని నేనె !
తొలివియోగిని నేనె !

ఆనాటి కీనాటి కేను నీదాననే !

నునుమబ్బు లేదున్క కొనలపై సోన లో
నెలవంక చిఱునవ్వు చలువపాట,

తొలిప్రొద్దు పొడుపు రేకుల పైఁడిదారుల
ఏరు లో మంచుకన్నీరుపాట,

పావురా యుయ్యాలపక్షాలయంచుల
జాలు లో గాలి నీలాలపాట,

విరజాజికన్నె నిద్దురకన్ను రెప్పల
కొల్వు లో నెత్తావికలలపాట,

కలసి, నీగొంతుత్రోవల సెలలు గట్టి,
అలల నుప్పొంగి, నా హృదయాంచలములఁ
బారి, దాహాన బీటలువారి యెండు
ఈ బ్రతుకునిండ నిండిపోయినవి, చెలియ !

ఒకపరి తీయ నౌ బరువు
లొత్తఁగ జీవిత మంత క్రుంగి, వే
ఱొకపరి తేలి యేలో యెటకో
యెటకో జలదాల దాఁటి తా

రకల విశాలనీలపథ
రాజుల నెల్ల నతిక్రమించి పో
యి కలియు సోలి సోలి చదలేటి
తుషారపు స్వప్నరాసులన్.

ఈవు తేనియగొం తెత్తితేని, నీ క
పోలములు చిఱునవ్వునేత్రాలుకూడ
మఱచి సర్వమ్ము, సొగసుగా శిరసు ద్రిప్పు
చెందులకొ పాడినట్లుండు నేదొ యేదొ!

మఱియు నేవేవొ కలలు ముంగురుల జాఱి,
వాలి కనుబొమ్మ నునుగొమ్మవంపులందు,
దూరి చూపుల, చెక్కిళ్ళఁ జేరి, మంద
మందహాసంపుమసకలో మాయ మౌను!

ఆమె కన్నులలో ననంతాంబరంపు
నీలినీడలు కలవు;
వినిర్మలాంబు
పూరగంభీరశాంతకాసారచిత్ర
హృదయములలోని గాటంపు నిదురచాయ
లందు నెడనెడఁ గ్రమ్ము;
సంధ్యావసాన
సమయమున నీపపాదపశాఖికాగ్ర
పత్రకుటిలమార్గములలోపల వసించు
ఇరులగుసగుసల్ వానిలో నిపుడు నపుడు
వినఁబడుచునుండు;
మఱికొన్ని వేళలందు
వానకారుమబ్బులమెయివన్నె వెనుక
దాగుబాష్పమ్ము లామెనేత్రములలోనఁ
బొంచుచుండును;
ఎదియొ అపూర్వమధుర
రక్తి స్ఫురియించుఁగాని అర్థమ్ము కాని
భావగీతమ్ము లవి....

ఎదలోపలి యెదలో, నె
మ్మదిలో, జీవితరహస్యమార్గమ్ములలో
వదలని కోరికవై, నా
బ్రదుకుబరువు లెల్ల పాట పాడింతు సఖీ!

చలువపిసాళిగాలి
నునుచక్కిలిగింతల కౌఁగిలింతలన్
నిలువున పాటగా
కరఁగనేర్చునా నీరవవేణువీథి! నీ
వలపుతలంపు సోకిననె,
ప్రాణసఖీ! బ్రతు కెల్ల కోటిగాం
తుల విడి సోనలై పొరలు
నూతనగీతసుధాపథాలలోన్!

నీయాజ్ఞ కూడెనా, గొంతుముడి వీడెనా
హాయిగా యుగయుగంబుల కలల్ పాడనా!
చిరగాఢనిద్ర మేల్కొలిపి సందేశాలఁ
బరపనా దిక్కుదిక్కులకు చుక్కలకు!

ఆ యనాథబాలిక ప్రియురాలు నాకు !
ఆమె నవసాంధ్యసమయమల్లీమనోజ్ఞ
కుసుమకామిని; ఎదో వింతకోర్కెతీయ
దనపువేదన నా జీవితమున రేపు !

ఆమె స్వప్నాలు కను నెప్డు; డామెమేని
తలిరులావణ్య మొక్కనేత్రముగ విరిసి
వెలుఁగుచూపుల తనుదానె యరసికొనును !

ఆమె సొగసు రేకులు విచ్చి యమృతమధుర
నటన వాసింపఁబోదు, గానమ్ము సేయదు;
ఆమె ప్రాయంపువాకిళులందు వలపు
తడఁ బడి యడంగు సిగ్గుదొంతరల తెరల !

౧-౨౧

తవిలి బిగిసిపోవు నొక్క సంధ్యావసాన
సాంద్రకాశ్మీరదృఢపరిష్వంగమందు
నిమిడి, నిలు వెల్ల ఒదిగి శోషిలిన యామె
నేను తొలిసారి కాంచి కంపిలితి నాఁడు.

కార్మొయిలు పెదవుల ఖండఖండములుగ
చిదికిపోయిన కౌముదీమృదులకళికఁ
గాంచి యొకరేయి దుస్సహగాఢదుఃఖ
మాఁపుకో లేక యేడ్చె నా యార్ద్రమనము !

క్రొత్త రాక నొడలె యెఱిఁగికొనని గాని
తమకపుంగౌఁగిలింతతొందరల నలఁగి
యూపి రాడక మూర్ఛిలు నొక్కయలరుఁ
గని వనటఁ గ్రుంగినా నొక్కదినము దినము.

వాడిపోయిన ప్రతి సౌరభమ్ముకొఱకు
బ్రతుకు బ్రతు కెల్ల కరఁగు బాష్పములు కాఁగ,
ఎట్లు కననేర్తు నానాఁటి దృశ్య మేను !
దారిఁ దల లెత్తు నింత సౌందర్యలవము
వదలిపోలేరు చంపెదువఱకు వీరు !
మృదులకరుణామధురము నాహృదయ, మెవ్వ
రెఱుఁగఁజాలుదు రే మని యేడ్తు నెపుడు !

తుది మొదలు లేని దానాఁటి తొలినిశీథ
పుం దమము;
 అఖాత మయ్యది;
 అందు దారి
లేదు; మిఱుఁగు రేనియు కానరాదు;
 ఒకండ
పొంచి యొదిగితి నే మూల మూలలందు.

నాఁటి నిశీథనీలగగనమ్ముృపయిం
 గను మోడ్చు మేఘపుం
గాటుకకౌఁగిలింతలఁ బెనంగి
 సుకమ్ముగ నిద్రవోవు నీ
వేటికొ యొత్తిగిల్లి, తరళేక్షణ!
 నూత్నవియోగశోకపుం
జాటున స్రుక్కుదీనుఁ గనినా
 వనురాగము మోసు లెత్తఁగాఁ.

నీ కనుచూపుచీఁకటులనీడల
 నా యెద నిల్వలేదు, పే
రాఁకలిఁ గొన్న నా బ్రతుకునంచు
 త్వదీయ మనోజ్ఞ హాసరే

ఖాకమనీయకాంతిసుధ

కొల్వాలు కట్టఁగలేదు, కాని యే

మో కలఁగున్ మనమ్ము

వలపుందమకమ్మున ని న్దలంచినన్ ?

నవసి త్వదీయ మౌ కరమృణాళము

వీణియమీఁద మూఁగయై

యవశత వాలెనో ! అనలమై

దహియించువిషాదబాధ డి

ల్లి వడెనో నీ మనోజ్ఞమధుర మ్ముగుకంఠము,

కారుచిచ్చు వే

సవి గళ మెత్తి పాడుటకుఁ

జాలని సోనవిధాన ప్రేయసీ !

నవ నవ వసంతచరణముల నాట్యమ్ములా !
భవదమృత లావణ్య వసన విలసనములా !
మెఱపులై పిలుపులై మెఱసినవి ! పలికినవి !
దిశలఁ బడి పరువు లిడు శిశిరంపు టడుగులో !
తుది వీడుకోలుపులో ముదుసలి నిరాశలో !
నీడలై జాడలై వెఱచినవి ! పఱచినవి !

నా బ్రతుకు నేఁడు నందనచైత్ర మౌనో !
ప్రాభాతగగనపూర్వప్రాంగణ మ్మౌనో !
చెర దొలఁగు జీవమో ! మఱపు విడు తేజమో !
నడక నెఱుఁగని తేనె, ఎరక యెఱుఁగని తావి,
కయిసేసుకో లేక కలఁతవడు సోయగము,
పాటయై పక్షియై ఆశయై హాయియై
దెసదెసల మీఱునో, దివ్యపద మంటునో !
కదలువేకువకనుల నిదుర చెదరెడువేళ,
మాయుప్రతితారకయు మబ్బుకల యావేళ,
అలముస్వప్నము లొక్క వెలుఁగురూ పౌవేళఁ,
జేరితివి నాజీర్ణజీవితప్రాంగణద్వార మావేళ....

ఓ వసంతవిలాస మాధుర్యమా !

ఓ యుషఃకల్యాణ లావణ్యమా !

నేఁడు నా జీవితముకూడ నిర్ఝరాంగ

నా దరస్మిత మయి ప్రపంచాలు ప్రాఁకు !

పిలుచు నీరేడులోకాల ప్రేమకొాఅకు !

పఅపు నా హృదయము చరాచరములకును !

ఈ నవాబ్దాగమమ్ముతో ఈ కిశోర
మధురకలకంఠమునకు హేమంత మెడలి
గొంతుచెర వీడెనేని, హృదంతికమున
దాగి యొదిగిన ప్రేమగీతాలరుచుల
నొక్క టొకటె నీకయి విప్పుచుండు సకియ !
విరిసికొనుపోవుచున్నవి వీని యమృత
గళరవమ్మున కపుడె పక్షములు చెలియ !
ఎగసి కొనిపోవు నొరు లెవ్వ రెగురలేని
స్వప్నసీమల కూహాప్రపంచములకు !
నీ వొకర్తుక వానిపై నిదురఁగొమ్ము;
చల్లఁగాఁ బోదు వెచట కెచ్చటికొ గాని;
ఇపు డపుడు నీవు మేల్కొంతువేని, వీని
పాటపెక్కలరొద వినంబడును నీకు;
అంత ఝ ల్లను నీబ్రతు కంత; మరల
ఒత్తగిలి హాయిగఁ గను మూయుదువు నీవు !
నాకుమాత్రము గాన మున్నంతవఱకు
చాలు చాలు నీ ప్రణయనిశ్వాస మొకటె,
మోసికొందునో నా గీతములను నిన్ను !
మూగవోదునో రాయి యైపోయి చిరము !

నా హృదయమందు విశ్వవీణాగళమ్ము
ఘోరు ఘోరున నీనాఁడు మ్రోఁత వెట్టు;

దశదిశాతంత్రు లొక్క సుధాశ్రుతిని బె
నంగి చుక్కలమెట్లపై వంగి వంగి
నిలిచి నిలిచి నృత్యోత్సవమ్ముల చలించు.

వెలుఁగులో యమృతాలో తావులో మ ఱేవో
కురియు జడులు జడులు గాఁగ, పొరలి పాఱు
కాలువలు గాఁగ, పూర్ణకల్లోలములుగ;
కలదు నాలోన క్షీరసాగరము నేఁడు !

దారి దొరకని నా గళద్వారసీమ
తరగహస్తాల పిలుపుతొందర విదల్చు !
మోయలే నింక లోకాలతీయఁదనము !
ఆలపింతు నానందతేజోంబునిధుల !

ప్రేయసి ! చలియింపని నీ
చేయిఁ జేయిఁ గీలింపుము
చలియించెడు నా కంఠము
నిలిచి నిలిచి పాడఁగా !

ఊర్వశి ! ఊర్వశి ! నాతో
ఊహాపర్ణాంచలముల
వెర పెఱుఁగని కను మూయుము !
తిరుగ రాని దొరకఁ బోని
శీతాచలశిఖరోజ్జ్వల
హిమపీఠాగ్రమున కెగసి
శిరము లెత్తి కరము లెత్తి
కురియింతమొ వినిపింతమొ,
మేలుకొనిన శ్రుతు, లనంత
కాలమె వికసించి వినఁగ,
గంగాపవిత్రకాంతుల !
యమునాశీతలమధువుల !

కలువపూ బ్రతుకులోఁ గనుమోడ్చు వెన్నెలే
కాలానలం బైన గతి యేమి !
నిరుపేద రెల్లులో నిదురించు సెలయేరె
కల్లోలమే యైన గతి యేమి !

చలువ తెమ్మెర జాణ చలచిత్తుఁడే కాని
మాలతీలతిక కీ మమతకౌఁగిలి యేలొ !
ఆగడమ్మే కాని మూగవేణువుగొంతు
మ్రోగునో హృదయమ్ము రాగిల్లువఱకేని !

నిదురలో స్వప్నాల కదలికే బరు వైన
కల లెల్ల కను విచ్చి కాల్చు నా గతి యేమి !
బ్రదుకులో భావాల పరిమళమె బరు వైన
భావాలె పరుషమై బ్రతుకు నా గతి యేమి ?

చివురాకు తెరలనే చిన్నవోవును కాదె,
విరజాజిమొగ్గనే విరియు మంటా రేమొ !
చదలేటి నీలాల ఝరులలో తారయా ?
నటియింప నేర్చునా ? నవయింప నోర్చునా !

ఈ నడికిరేయి వెన్నెలయెద చలించు
పిలు పెదో 'నాసఖా' యని వేగిరించు;
అనలమై కాల్చు నిశ్శబ్దమునె; కలంచి
పరువులెత్తించు కడల నా బ్రతుకు నిపుడు !

ఎన్నిమాఱులు సవరించుకొన్న చూపు
తొలఁగ వేమో యలము నేమొ నెలమొగాన
చెదురునే బెదరి బెదరి చెలియకురులు
జాలిగా నీలమేఘనిశ్వాసములటు !

నాకొఱకె చాచు సఖికంఠనాళమందు
మ్రోఁగక చలించి చెరవడ్డ మూగబాధ
ఎటు పిలుచు నన్ను ఆచూపుటిరుల; కనులె
పలుక నేరక విడివడి పగులు నేమొ !

అయ్యయో ! ఊర్వశీవిషాదార్ద్రమూర్తి
ఈ నిశీథాన ! నా హృదయాన ! నిండె
పూర్ణిమాశుభ్రయామిని బొగ్గువోలె
ఈ యెడఁదవోలె నిండిపోయినది నేఁడు.

ప్రాణసఖి ! నీ సుదూరతల్పమున సుప్తి
కట కలలు రావు, కలుగదు కలవరింత,
వేగిపో దిట నీకయి వేలురేలు
బ్రతుకు బ్రతు కెల్ల ఒక్క-నేత్రముగ కాచి !

వృషభవమస్తక మకుట మాణిక్యరాజ్ఞి! నీ
వెలుఁగుచూ పొకరేయి వికసించి వాసించి
మిలమిలా తళతళా మెఱసినది కురిసినది
పాతాళ భువనాంత పరిసర తమస్సులకు.

హాలాహలాంధకా రానలజ్వాల యై
కను మూయనే లేని కాలిపోనే లేని
ఈ నిరాశావేదనా నగ్నజీవిపై
నిలిచినది, పులకలై పులకలై పూచినది!

కరుణచే వలపుచే తరళ మైనా వీవు
బిడియాన నిరులలోఁ బడి యేడ్చినా నేను;
ఓరగా ఓరగా నొరుగు నింద్రుని శిరసు
విడిపోయి దిగిపోయి పడినావు నా౹మోల!

వైకుంఠమృదుకంఠ వైజయంతీమాల
తెగె నేమొ దిగఁబారు జగము లన్నీ దాఁటి!
సురభిసౌదామనిగ తరళమధుధారగా
ఈశ్వరాలోకమే యిటు వెడలెనో నేఁడు!

మూతపడనే లేని ముక్కోటిదేవతల
కనుతారకలు కోరకములై సుమము లయ్యెఁ;
ఓసరిలి యొండొరుల నొరసికొని విఱుగఁబడి
దిశలంత చీఁకటులు నిశయే దివస మయ్యె!

ఆకాశసికతాల నడఁగి ప్రాఁకు స్రవంతి
మూఁడులోకాలలో మ్రోయుపుణ్య మ్మయ్యె!
నరకలోకపుటింట నవయు శోకతమస్సు
వెలుఁగు నమృత మయ్యె! వీనిభాగ్య మ్మయ్యె!

మఘవమస్తక మకుట మాణిక్యరాశిలో
మరుగు హృదయమ్ములో మందు జీవితములో
మాత్ర మాసమయాన మసకగా మసకగా
మొయిలుకాటుకనీడ ముసురుకొనెనో.... పాపము

కలుగునా నాకు నీ వియోగమ్ము సకియ ?
వాలు నీకనురెప్పల జాలిచూపు
లల్ల దిగజాఱి దిగజాఱి, అమరనాథ
కంఠమాలాసుమదళాలు గాఁగ, గగన
వాహినీ నీరజాళినీ పక్షనీల
నాట్యములుగ, తారాతోరణములు గాఁగ,
నింగినీడలమెట్లుగా, నీలిమొయిలు
జిలుఁగువిఱుపులుగా, పులుఁగులుగ, నలరు
లుగ, నలలుగా, కలలు గాఁగ; సొగయఁబోని
విసివికోని వింతవలపు వేడి వేడి
తొందరలపరువుల నెంత తూలి తూలి,
ఎంత దిగజాఱి దిగజాఱి, ఎంత వెదకి
వెదకి పడినవో, పెంధూళిఁ గదల లేక
వెలుఁగు లేక యెగుర లేని పీని కనులె
శిలలు గాక; వదలనికౌఁగిలిఁ బెనంగ
బెదరు గాక లజ్జాగాఢవేదనాగ్ని !
వదలునా యెట నెదు రేగి వెదకు వలపు !
కలుగునా నాకు నీ వియోగమ్ము, సకియ !

ఏనుం నిద్దుర వోదునో, యేమొ కరుణ
సెలవు గైకొన కేగఁగా వలదు; ఇన్ని
నాళ్ళ యెడలేనియెడఁబాటు నానిరీక్ష
ణమ్ము బరువులు బరువులై నయనయుగళ
మయ్యె, దిగలాగు నిద్దురమఱపులకును.

ప్రియతమా, ఇఁక నిదురింతు పిలువఁబోకు
బాసిపోకు నిర్భాగ్యపుబ్రదుకు దాఁటి !
ప్రియతమా, పొరలి పొరలి మెయిళు లేవా
మేలుకొనసీవు రెప్పల వాలి యదిమి !

ఎటు లెగసి యెగసిపడుదు ! ఎటులు బేల
కేల నిన్నంటి యదిమికో తూలిపోదు !
అబ్బ ! నా బ్రదుకంట, నీ యడుగుదోయి
నాఁప, ప్రియతమ, శృంఖలమ్మై పెనంగ
దిక్కుమాలినయెడఁద బంధింపలేను !

ప్రియతమా, నిను వదలుకోలేను, నిదుర
కడలియై కాటుకై కనుఁగవ నడంచు
ప్రియతమా, వీడిపో కోయి, వీడలేని
నామమత్తచిచ్చు కునుకునా నన్నుఁబోలి !

కలంగు సుషుప్తి నొత్తిగిలంగాం
　　　బడి లేచు ప్రభాతకాల శ్రీ
తలహృదయంపుటూరుపులు తాంక,
　　　నిశానిటలాంతసీమ శ్యా
మల లలితాలసాలకలు
　　　మందముగా నటియింప, రాలెనో
యలసెనొ స్వప్న మొం డవశమై
　　　పడె నా కనురెప్ప సెజ్జలన్.

నిన్నరాతిరి చికురంపునీలికొనల
జాఱిపడిన స్వప్నమ్మొ నిజమ్మొ, యేమొ !
కోమలామోదకౌముదీకోరకమ్మొ !
సురవిలాసవతీ ప్రేమచుంబనమ్మొ !

నిదురపొదిగిళ్ళ మెయి మెయి నొదిగి యొదిగి
వెడలినా మంట నందనవీథులంట,
ఎఱుంగరాని దెదో కోర్కెబరువు వలనం
దడంబడి పెనంగు సోమరినడలు సడల.

౧౩౭

అపుడు కావలి మొగసాల నా వనాన
నళికుమారుల హెచ్చరికలును లేవు;
అలరుటంతఃపురాలలో వలపు బెడఁద
నెగయఁబోదు నిడుదయూర్పు సెగయుఁగూడ.

మందాకినీ మందమందగీతానంద
మధుమాధురీ శీతలహరీపరిష్వంగ
మందుఁ బులకించి, పుష్పించి, జీవించి యా
నందనారామ మావేళ నిదురించు.

రాసులు గాఁగ నేలపయి రాలుచు
        పూవులు దూదిదారులే
చేసి నిశాసమీరణముఁ జీలుచు
        తావుల పాఱునేరులే
వోసి, సుకమ్ముగా నిదురవోవు
        లతాలలితాంగి నోత్సుకం
డాసితి నంట; ప్రేయసియు
        నాకయి గ్రైకొనెనంట ఆఁగఁగాఁ!

ఎదురుగా నిల్చి యెద నెద యదుముకొనెనొ,
కనులు కన్నులకౌఁగిలి గరఁగఁ గనెనొ,

రెప్పపాటు తెర యయి నా హృదయపుటము,
దెఱచి నిలిచిన దొాక బాష్పతరళకణము !

మాయు నిశీథికుచ్చెళులమాదిరి
ప్రాఁకు వనీమహీజపుం
జాయలఁ గోమలప్రణయచంచలయౌ
వ్రతతీసతీగతిఁ
ప్రేయసి వాలి, నిండు తెలివెన్నెల
వన్నెల మల్లెపూవులఁ
దోయిలి నించి, నా చరణధూళుల
నొదల నుంచి జాలిగాఁ —

"ప్రియతమా, దాసి యక్షయప్రేమసేవ
కీలతాంతాలు మొత్తాలు చాలు నోయి ?
నింగిమూలలె నీలిపందిళ్లు పఱచి
యెంత తెలిమల్లెతోఁట వేయించినానొ !"
అడుగుల నడంగి జీవిక నరయ లేక
పిలుచు సెలయేటినిస్స్వప్రహోచ్చలితకంఠ
కరుణ మాలింపఁగా లేక కరఁగ లేక
యచలపాషాణహృదయ మే మౌనొ పైన ?

కోరిక లెల్ల ధూళిఁ బడఁ
గోల్పడి దిక్కుల శూన్యదృక్కులం
జీరి, యెటో వృథా శిశిర
జీవితభారము బుచ్చుచున్న భూ
మీరుహ మేను; నా మొరడుమేన
నవప్రసవాలజాలులే,
ధారలు ధారలై పదము
దాఁక హిమాంబుతరంగపాళులే !

కనుల వికసింతునేగదా గగన మలమి !
చెలియ నాటిన తోఁటలో నలరు లేమొ
కాక నా పాదముల మస్తకమ్ముతోడ
పూజకై పారఁబోసిన పూవు లేమొ !

విడనివాసన పదములు విరులె యయ్యె;
ఆననమ్మున నశ్రులే యార వయ్యె;
నిలిచినాఁడ నేఁటికిఁగూడ తొలివసంత
కాలపుఁబ్రభాత తరుణ వృక్షమ్ముకరణి !

నావలెనె యాతఁ డున్మత్త భావశాలి,
ఆఁగికోలేడు రేగునూహల నొకింత !
ఎట్టినిశినే నదరిపోవు నెగసిపడును !
ఎన్ని చుక్కలపాటు లెన్నెన్ని మెఱుపులు !

ఇంత చిఱుగీతి యెద వేగిరించునేని
పాడుకొనును తాండవనృత్య మాడుకొనును;
మస్తక మ్మోరగా వంచి మన్ను మిన్ను
వేయికే లాడఁగా వ్రాసివేసికొనును !

ఏ నెఱుంగుదు నావలెనే యతండు
పాటపదములకై నిత్యపథికుఁ డయ్యె;
ఏ నెఱుంగుదు నావలెనే యతండు
ప్రతిపదమ్మున శీతలస్వాదుమధుత
షారసుల పార్శ్వముల విరజల్లు చేగు !

ఈ మిడిసిపాటు నీమ్రోల నేల తేనె
తేటచినుకేని లేని యీపాట కిపుడు ?
ఇంత చివు రిచ్చి యంత హేమంతశృంఖ
లాల బంధింతు మూగతనాల గొంతు !

స్వామి ! నూత్నవసంతజీవప్రవాళ
పల్లవమ్ములరుచులె నాబ్రతుకుజీరఁ
గోసి తీయఁదనమ్ములా వోసినపుడె
వెడలిపడ లేద ! యొకయడు గిడఁగ లేద !

మూఁడులోకాలబరువులమ్రోఁత నడఁగి
యడఁగి చిదికెను గద అంధజడము తాను !
ఓయి గాయకసార్వభౌమా ! యి వేటి
తగని త్రుళ్ళింత వెలితినృత్యమ్ము లోయి !

అవధరింతువు ప్రతిదివసాంతమందు
నిత్యనూతనతాండవనృత్యకేళి,
ఓయి నటరాజ, తల లైన నూప లేక
భువనములు దుర్భరానందమున నడంగ.

అప్పు డూహాంచలమ్ముల నతిశయించి
పొరలు నమృతరసంపుమాధురులలోనఁ
గొట్టుకొని పోవు, స్వామి, నా క్షుద్రజీవి
తమ్మిగూడ దారియె లేక తనివి వోక !

అంత నే వెఱ్ఱినై పోదు నయ్య నిన్నుఁ
బోలి పాడఁబోవుదు; నిన్నుఁబోలి నాట్య
మాడఁ బోవుదు, లజ్జ బోనాడి; కాక
యింతదాహమ్ము దహియింప నెటులు మనుదు !

ఏవిధాన సౌందర్యరసైకజీవి
నిలువ నేరుతు నిట నొక్క నిముసమేని
మామకీన జీవితశుష్కమార్గముల త్వ
దీయపాదమంజీరముల్ మ్రోయకున్న !

ఆటతో పాటతో నేర్చినట్లు దేవ,
ఏనుకూడ నీవలె నటియింప నిమ్ము
ఎడతెగనియాత్ర నెట్లొ సాగించువఱకు !
ఎట్లొ నీ దర్శనమ్ము సాధించువఱకు !

స మా ప్త ము.

# కృష్ణపక్ష సింహావలోకనము

శ్రీ తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి.

౧

కృష్ణపక్షములోని ఖండికలలో గాని, గీతికలలో గాని దేనికిని కృష్ణపక్ష మనుపేరు లేదు. కవి కృష్ణశాస్త్రి. కవిత్వము విశేషభాగము కరుణరసాత్మకము. నిరానందసూచకమగు కృష్ణపక్షమును కవి స్వీకరించి, సాంకేతికముగా కావ్యసందోహమునకు ఈనామ ముంచినాడు. ఈసందోహ మాంధ్రసారస్వతములో అపూర్వము అత్యంతవిశిష్టము.

కృష్ణశాస్త్రిగారి బాబయ్య నాన్నగారు పిఠాపురాస్థాన కవులు. ఈ విద్వత్కవులు గంగాధర రామారావువారి ఆస్థానములోను, సూర్యారాయ మహీపతివారి ఆస్థానములోను విశేషాదరము పొందెడివారు. వారిబిడ్డ డగుటచేతనే ఈ కవికి ప్రభుభక్తి కలదు. అందువల్లనే కృష్ణపక్షము పీఠికాపురమహారాజున కంకితమగుట సంభవించినది.

౨

ఈ కవి భావతరంగిణి చతుర్విధముల ప్రవహించుచుండును. ఆ వేణికలు నాలుగింటికిని పరస్పరసంబంధము కూడ గోచరించును.

అందు మొదటిది స్వతంత్రబుద్ధి, ఆధునికలోకములో సర్వతోముఖముగా విజృంభించుచున్న స్వాతంత్ర్యభావతరంగము లీకవిహృదయమున అఘాతము చేసి, కవితలో బహువిధముల వ్యక్తమయినవి. స్వేచ్ఛాగానము అను కావ్యశీర్షికయే దీనికి నిదర్శనము. ఈయన స్వేచ్ఛ నిరర్గళమై, నీరూపమై లోకహానిచేయు స్వేచ్ఛాభావము కాదు. ఈకవి యిట్లన్నారు.

'క్రౌర్య కౌటిల్య కల్పిత కఠినదాస్య
శృంఖలములు తమంతనె చెదరిపోవ
గగనతలము మ్రోగగ కంఠ మెత్తి
జనము నింక స్వేచ్ఛాగానఝురుల నింతు.'

ఈ స్వేచ్ఛాగానము 'తిమిరలతను తారకాకుసుమములు దాల్ప జేయునది.' కర్కశశిలను నవజీవకళల దేరజేయునది' 'చిత్తమానందమయమరీచికల సోలించునది.'

ఈ కవి చిత్రకల్పనలకు పలుమారు ప్రయోగించు నుపమానముల స్వభావమువలననే స్వేచ్ఛావృత్తి విశదమగుచుండును. ఝరులు,విహంగములు, మేఘములు, విద్యుల్లతలు, ఝంఝాప్రభంజనములు, తారకలు, మిణుగురులు— ఇట్టివి మాటిమాటికిని రచనలో కానిపించుచుండును. ఈ కవి 'స్వేచ్ఛాకుమారుడు'; 'గగనపథవిహారవిహంగమపతి'; 'మోహన వినీలజలధరమూర్తి'; 'ప్రళయఝంఝాప్రభంజన

స్వామి'; ఆకులో ఆకు, పూవులో పువ్వు'; 'గలగలని వీచు చిరుగాలిలో కెరటము'; జలజలని పాడు సెలపాటలో తేటి; పగడాలచిగురాకు తెరచాటు తేటియు నయి, ఆకలి దప్పులు, చింతలు వంతలు లేక అడవిలో దాగిపోయి ఏకతను తిరుగాడుట యీకవి యభీప్సితము.

ఈ స్వేచ్ఛాప్రియత్వము బహువిషయముల గానవచ్చుచున్నది. సంప్రదాయానుగతము లైన ఛందస్సులనే గాక నూతనచ్ఛందములనుగూడ గ్రహించి వానిలో భావములను బాగుగా పలికించి రస మొప్పించుట; పాదభాగములో ఖండిక ప్రారంభించుట; పాదాంతము కాకుండనే కావ్యము ముగించుట; నూతనప్రయోగములు చేయుటలో వెనుదీయకుండుట; కొన్ని ఖండికలకు నామ ముంచకుండుట—ఇత్యాది విశేషములు సహృదయులకు నవ్యకళ లాపాదించు గుణములుగా గోచరించును.

3

బహుస్వేచ్ఛాభిమానము సుఖప్రదము కానేరదు. చిత్రవిచిత్రగతులు గల యీలోకములో స్వేచ్ఛారతికి సామాన్యముగా దుఃఖమే ఫలితము. ఈకవికి గూడ అదియే ప్రాప్తమయ్యెను. దుఃఖమే ఈయన భావతరంగిణిలో ద్వితీయ వేణిక. దుఃఖమును వర్ణించుఘట్టములం దీకవి అసామాన్యుడు. దుఃఖ

ములోతు గ్రహించినవారు. దుఃఖమే ఈయనకు ప్రియతమ మని తోచును. 'అమలమోహన సంగీతమందు హృదయదళన దారుణరోదనధ్వను' లీకవికి వినబడుచుండును.

హృదయనాళము తెగిపోయె, నాహృదయధనము
తొలగిపోయెను, జీవితఫలము స్రుక్కి-
నేల బడె, నింక జీవింప నేల సఖుడ!
హృదయశోణితధార నెదుగుజీవితవల్లి
మొద లంట దూల్చినారే—భయదాగ్ని
కీలలను వ్రేల్చినారే!

ఈవిధముగా విలపించు మానసమునకు దుఃఖముతో నిరంతర సాహచర్యమువల్ల దుఃఖమే వింతభోగముగా పరిణమించినది. అది నిరుపమానంద సంపద యయినది. ఆత్మశక్తి నుజ్జీవింపజేసినది. అంతట ఈయనకు లోకము తృణప్రాయముగా గానబడినది.

ఎవ్వరని యెంతురో నన్ను? ఏ ననంత
శోకభీకరతిమిరలోకైకపతిని......
నాకు నిశ్శ్వాసతాళవృంతాలు కలవు
నాకు కన్నీటి సరుల దొంతరలు కలవు ...
మీరు మనసారగా ఏడ్వనీరు నన్ను...

అని దుఃఖములోని సౌఖ్యము నెరిగిన కవి నిరాఘాట ముగా ఆక్రోశించినాడు.

౪

ధీరులు దుఃఖాభిభూతులు కాక దుఃఖములోనే సుఖ సారమును గ్రహింప జూతురు. కేవలము దుఃఖముతోనుండు దీర్ఘ సాహచర్యముచేతనే అట్టియత్నము సాధ్యము కాదు. ఒకవేళ అట్టిప్రయత్నము జరిగినను ప్రీతి లేకుండ సఫలము కానేరదు. దుఃఖములోతు గ్రహించిన యీ కవిహృదయ ములో ప్రీతి అంకురించి దుఃఖోపశాంతి చేసినది. అట్టి ప్రేమాం కుర వర్ణనమే కృష్ణపక్షములో తృతీయవేణికగా రూపొందిన భావతరంగిణి.

ప్రేమాంకుర మైనతోడనే ప్రకృతియందలి నానావిధ పరిణామములు, వలపునలని విలాసచేష్టలుగా పొడగట్టును.

'అలరుపడంతు లెల్ల...'

కాని క్రమక్రమముగా ప్రేమ స్వచ్ఛ మగును. అప్పుడు ప్రయోజనము ప్రధానముకాక స్వచ్ఛంద మగును.

సౌరభము నేల చిమ్ము పుష్పవ్రజంబు
చంద్రికల నేల వెదజిమ్ము చందమామ ?
ఏల సలిలంబు పారు ? గాడ్పేల విసరు ?
ఏల నాహృదయంబు ప్రేమించు నిన్ను ?

ప్రేమలోని నిరతిశయానందము గ్రహించిన పిమ్మట "హేమమణిగణరత్న" మవసరము కాదు. ప్రేమయే దివ్యభాగ్యముగా దోచును.

ప్రేమ దుఃఖమున కుపశాంతి కలిగించునదే యయినను కేవల మీప్రపంచమునకు సంబంధించిన దగునంతవరకు తనవెంట నూతన మైన అశాంతిని కొనిరాక పోదు. ఈ యశాంతి బహువిధములు. అందు సాధారణమైనది వియోగ జన్యము. అట్టిసందర్భమున—

ఈవిరహసంతాప మీప్రవాస క్లేశ
మేపగిది సహియించు నెటులు జీవించున్ !

అని హృదయము విలపించుచున్నది. ఒక్కొక్కప్పుడు ప్రేమాతిశయమువలన భయాతిశయము కలుగుచుండును.

నీ కనురెప్పకొనల నొక చినుకైన కదలనీ
ప్రళయకాలానంత భయదపాథోరాశి
వలె విశ్వ మెల్ల ముంచెత్తు సుమ్మో !

అనిపించును—

ప్రేమజన్య మైనయశాంతి ప్రేమ విఫలమయిన ఘట్టములు వర్ణించునప్పుడే దుర్భరముగా నుండును. భార్య పరలోకగత యయిన తర్వాత—

నావిరులతోట బెంచికొన్నాడ నొక్క
పవడపు గులాబియొక్క నాప్రణయజీవ
నమ్ము వర్షమ్ముగా నయనమ్ము గురిసి.

...అల్ల దిగియె
ఒక్క క్రూరార్క కిరణమ్ము ఉర్వి వ్రాలి
నా గులాబి సోలి మూలి నన్ను వీడె!

ఇట్లు కృష్ణపక్షములో కవిత్వము ఆత్మాశ్రియమై హృదయంగమ మయినది.

౩

స్వతంత్రబుద్ధితో లోకములో సంచరించి దుఃఖముల పాలై ప్రేమవలనను సంపూర్ణ శాంతిపొందలేని మనుష్యులకు ఒక్కటే శరణము. అది ఈశ్వరారాధన. దుఃఖితాత్ములు ఆత్మనిరసనము చేసికొని భక్తిపరాయణులయి భగవానుని యనుగ్రహముచే పవిత్రులగుదురు. అట్టిచాయలు ఈకావ్య సందోహములో అచ్చటచ్చట పొడకట్టుచున్నవి. కవిభావ తరంగిణిలోని చతుర్థవేణిక యిదియే.

ఒక్కొక్క భక్తుడొక్కొక్క విధముగా ఈశ్వరసాన్నిధ్యమునకు యత్నించును. అందులో ఆత్మగర్హణవిధానము సాధారణము. పాపోహం పాపకర్మాహం అనిపించుట సహజము. అట్టియెడనే ఉద్బోధనరూపముగా—

కురియుమురా కన్నీటిని
మరిమరి విలపింపుమురా
సరము గూర్చి పరమేశుడె
దాల్చునురా పాపీ

అని ఆక్రోశించుట సంభవించును—

భగవానుని పాద సన్నిధానమున చేయుప్రతాపములు గాని, ఆత్మగర్హాము కాని యెన్నడును వ్యర్థము కావు. మొట్ట మొదట ఈశ్వరుని ధ్యానించుట యెట్లో యని శంక పొడ మును. క్రమముగా భగవానుని 'వింతచేతలు' విశ్రాంతి కలి గించును. సర్వాత్మకునకు కానుకగా నేమి యర్పింప దగునో యను సంభ్రమము జనియించును. పతితపావను డగుపరమేశ్వ రుని పాదసంపర్కముచే సమస్తమాలిన్యము క్షాళిత మగు ననుప్రత్యయము తుదకు ప్రభవించును. అప్పుడు—

కలుషదుర్దాంత పంకసంకలిత కుహార
ముల జనించు మదీయాశ్రుమలినధార
స్వామి, భవదీయ పాద దేశమునఁ బాఱి
పరమపావన జాహ్నవీప్రతిభ గాంచు!

అనెడి ధైర్య మంకురించును.

ఈవిధముగా సమస్తమును ఈశ్వరార్పణము చేయు నపుడే అవ్యయానంద మావిర్భవించును. అది సమగ్రముగా సంభవించినప్పుడు కృష్ణకవి హృదయములోని కృష్ణపక్షము శుక్లపక్షముగా పరిణమించి లోకముపై నూతనచంద్రికలను ప్రసారింపగలదు.

—శివశంకరశాస్త్రి